# DEVIBHAGAVATAM.

## Skandha 4.






BY

TIRUPATI VENKATESWARA KAVULU,

*SATAVADHANEES* &c. &c. &c.



FIRST EDITION,
1,000 COPIES.

PRINTED BY

M. BHYRAVAMURTI,

AT SREE BHYRAVA PRESS

MASULIPATAM.

*Price 9 Annas.*

1909.

శ్రీరస్తు.

శ్రీమత్పరదేవతాయైనమః.




# దేవీభాగవతము.

## చతుర్థస్కంధము.

ఇది

శ్రీ తిరుపతి వేంకటేశ్వరులచే

రచియింపఁబడి

శ్రీ భైరవముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపఁబడెను.

మొదటికూర్పు 1,000 కాపీలు.

మచిలీబందరు.

దీనివెల రు 0-9-0.

1910.

# విషయసూచిక.

శ్రీమత్పరదేవతాయై నమః

# దేవీభాగవతము.

---

తిరుపతివేంకటీయము.

## చతుర్థస్కంధము.

---



ని ర్గ్రస్త హృదయకమలాం
తర్లక్ష్మీకృతసమస్తతత్త్వ! శుకపితా
మర్లతికావిచ్ఛేదక!
చర్లబ్రహ్మాయసుధీ! యశస్సత్త్వనిధీ. 1

వ॥ అవధరింపు మనంతరంబు మునులు «మహాత్మా! యవ్వలికథ వినిపింపు మనవుడు సూతుం డిట్లను నట్లు పురాణకథనోన్ముఖుం డగు వ్యాసునకు జనమేజయుం డిట్లనియె. 2

క॥ అస్మత్కులాభివర్ధన!, విస్మయకరదివ్యచరిత! వేదవ్యాసా!, భస్మీకృత
పాపౌఘ! శ్రుతి, స్మృతితత్త్వజ్ఞ! యొకటి దెల్పుము నాకున్. 3

ఆ॥ వె॥ శూరసేనసుతుఁడు సుగుణుండు వసుదేవుఁ, డనఁగ విందు హరి
యుఁ దనుజభావ, మందె నెవని; కాతఁ డంగనామణితోడఁ, గం
సుచేత నెట్లు కట్టఁబడియె. 4

ఆ॥ వె॥ హరియు బంధనాలయమ్మున దేవకీ, కుదయమంది మీఁద నో
దిగి గోకు, లమున కేగ నేల! లలితుఁ గృష్ణునిఁ గన్న, వారు
పూర్వమం దెవరో వచింపు. 5

గీ॥ దేవకీవసుదేవులు తెలిసి తెలియ, కాచరించిన దేమి కంసాధమునకుఁ
గృష్ణునన్నలనార్గుర నేల చంపెఁ, బుట్టినప్పుడ కంసుండు పట్టఁబట్టి.

ఆ॥ వె॥ బాల! కంసుచేతఁ బట్టువడియు సభ, పథముఁ జేరుటేమి? పర
మపురుషుఁ, డైనహరికి గొల్లయలరుఁబోణులతోడఁ, గాఁపురం
బొనర్పఁ గలుగు టెట్లు.

క॥ ఆకృష్ణుం డొనరించిన, ప్రాకృతకార్యములనెల్లఁ బరిశీలింప
న్నాకే కా దెవ్వరికిం, జేకురు నాశ్చర్య మిట్టిచేఁతలు కలవే. ౯

క॥ కర్ణాకర్ణికగాఁ గను, పర్ణధ్వజుచరిత విని యపరిమితసందే, హార్ణవ
గత మగునామది, నిర్ణయము వచింపుమీ మునివర్యా! కృపన్.

ఆ॥ వె॥ ధర్మపుత్రు లగుచుఁ దనరెడినరుఁడు నా, రాయణుండుఁ గను
బురాణఋషులు, బదరికాశ్రమమున బహుకాలము తపమ్ముఁ
జేసి రనుట సుప్రసిద్ధమ కద. ౧౦

తే॥ గీ॥ విద్యమానశరీరులై వెలయువీరు, మరలఁ గృష్ణార్జునులు గాఁగ
మాఱుటెట్లు, ముక్తిఁగోరికదా వీరు మున్ను తపము, నాచరిం
చిరి మఱి జన్మ మంద నేల. ౧౧

క॥ తనకులవర్తనమును ద, ప్పని శూద్రుఁడు వచ్చుజన్మపరిపాకమునన్
గను క్షత్రియత్వమును జెప్పినశుచి మసలిన సతండ విప్రతఁగాంచున్

క॥ అనువుగ వర్తించినవి, ప్రునరుక్త జన్మంబు లేదు సహజిగ వీరల్
మునులు మహాత్ములు విపరీ,తనియతి క్షత్రియభవంబు దాల్పఁగ నేలా

గీ॥ అవనిసురశాప మెల్లయాదవులఁ గసిమ, సంగె గాంధారిశాపంబు
సరసిజాక్షు,నన్వయము మాపె నని వింటి; హస్తినరాజు, మించి యల
శంబరుండు హరించు టేమి. ౧౪

గీ॥ శక్తిమంతుఁడు హరి యుండ శంబరుండు,సూతికాగారమేరీతిఁ జొచ్చి
పిన్న, బాలు హరియించె నోక్కో! యిప్పలుకు వినిన, దుర్ఘటం బని
మనమున దోఁచకున్నె. ౧౫

గీ॥ ఆత్మజు హరించె శంబరుం డన్నమాట, దివ్యచక్షుష్కుఁ డగుహరి
తెలియలేఁడె,యరయ నీసందియంబుల నన్నిఁ బాపి, తెలియఁజెప్ప
వె సాత్యవతేయ! నాకు. ౧౬

క॥ సరసిజలోచనుతదనం, తరమునఁ దద్భార్యలెల్ల దస్యులచేతన్, బరి పరి బాధలు పడుటకు, నరయంగఁ గతమేమొ చెప్పవమా! యన ఘమునీ! ౧౮

గీ॥ విష్ణునంశమ్ముచేఁ బృథివీభరంబు,నడఁపఁ బుట్టినయద్దానవారి మధుర భయమ్మున నీడి ద్వారకాపట్టణంబు,నందు సకుటుంబముగ నుండు టబ్బురంబు. ౧౯

వ॥ అదియునుంగాక మహాత్ములును జగద్విదితంబుగ రాజసూయం బొనర్చి విప్రుల కనేకదక్షిణ లొసంగినవారును ధర్మతత్పరులును కృష్ణాశ్రితులును నగుపాండవుల కేల దుఃఖంబు సంభవించె! వేదీమధ్యంబునం బొడమినమహాభాగయు రమాంశజయును నగుద్రౌపది యంట రానిసమయమ్మున దురాత్ముం డగుదుశ్శాసనునిచే గృహీతకేశయై సభామధ్యమ్మునం గస్తి పడనేల! మఱియు విరాటునింట దాసి యగుటయుఁ గీచకునిచే నవమానిత యగుటయు జయద్రథునిచే నపహృత యగుటయు నాయను కేశాపంబున ఘటించె! సదాచారు లగుపాండవులు ఘనలోభమ్మున భీష్మద్రోణులం జంపనేల! మఱియు ౨౦

క॥ హరి ప్రేరేపింపఁగఁ దా,మంరయక పాండవులు వంశమంతయు నష్టాంకురముగ నొనర్చి రన్వయ,హరణమ్మునకన్న బిచ్చమైనను దగదే.

క॥ మును భాగతవంశము నా,శన మగుచున్ నీవు మాతృశాసనమున నెక్కాని గోళకు లగుపుత్రులఁ, గని నిల్పితి వేమి సార్థకంబు మహాత్మా!

గీ॥ తురకు వరిముల్లుకేతి నద్భుతముగాఁగ, బ్రతుకుఁ గాంచినమాతండిప్రాప్తమునిగ, కిమ్మునం దేల నైచె సర్పమ్ము! నెంత, రాజయినఁ గాని విప్రవైరమ్ము చనునె. ౨౨

క॥ ఆయీసందేహంబులు, పాయవు నామదిని సత్కృపామతివై వి జ్ఞేయగతిఁ దెలుపుమనుడు ద,యాయతమతి యగుచు వ్యాసుఁ డాతని కనియెన్. ౨౩

## వ్యాసుండు కర్మవిధము దెలుపుట.

క॥ నరపాల! కర్మగతి యన, సురలకు దుర్జ్ఞేయ మధికసూక్ష్మమ్మును ద
త్పరిపాక మెఱుఁగ శక్యమె, నరులకుఁ గర్మంబ కారణం బన్నిటికిన్.

గీ॥ కర్మ మనుబీజమున జీవగణము లఖిల, యోనులఁ జనించు నశియించుచుండు జీవుఁ, డాదియును నంతమును లేక యలరువాఁడు; గాని నిధనంబు గనువాఁడు గాఁడు సూవె. ౨౫

గీ॥ కర్మవశమున జీవుండు గాంచుచుండుఁ, గాయసంబంధతద్వియోగములు కర్మ, మమరు సంచితమని భవిష్యంబనియును, దెలియఁ బ్రారబ్ధ మని మూఁడు తెఱఁగు లగుచు. ౨౬

చ॥ చను సుఖదుఃఖముల్ జరయుఁ జావును బుట్టువుఁ గామలోభముల్
గనుఁగొనఁ గర్మసంస్కృతివికారములై యజరుద్రముఖ్యులై
నను విడ లేరు కర్మము ఘనం బది యన్నిటికన్నఁ దత్ఫలం
బనుభవరీతిఁ గాక మఱి యన్యవిధమ్మునఁ బోవ నేర్చునే. ౨౭

గీ॥ రుద్రుఁడు కపాలి చంద్రుఁడు రోగి యౌట, సూర్యుఁడు పరిభ్రమించు టించుకయు నన్య,కారణమ్మునఁ గా దది కర్మఫలము, సకల జగమును గర్మవశంబు సుమ్ము. ౨౮

గీ॥ జగము నిత్య మనిత్య మన్ సంశయంబు,మునుల కెడ తెగదన్న నెవ్వనికిఁ దెలియు, మాయ చొప్పడునంతకు నీయఖిలజ, గమ్ము నిత్యప్రచారమై కానిపించు. ౨౯

క॥ నానాయుగముల నానా, యోనుల నానావిధాభియోగంబుల జన్మానుగతి హరికిఁ గర్మా, ధీనతఁ గాకున్నఁ గలుగునే నరనాథా!

శా॥ వైకుంఠమ్ముఁ బరిత్యజించి కమలాబాంధవ్యముల్ వీడి శ్రీ
లోకాంతారవిహారముల్ విడిచి హేలానృత్యవాద్యాది సు
శ్రీకళ్యాణము లుజ్జగించి హరి వాంఛింపన్ గతం బేమి! ఘో
రాకార మ్మగుగర్భనారకముఁ గర్మాధీనుఁడే కానిచోన్. ౩౦

క॥ మలమూత్రపానమునఁ బం,కిల మగుగర్భంబునఁ దలక్రిందుగ భీత్యా
కలితుఁ డగుటకన్నను నీ,యిల వేఱొకదుఃఖ ముండునే నరనాథా

గీ॥ గర్భమున కెక్కు డగునరకంబు లేదు, పురువు లంగిమ్ములను బట్టి
పొడుచు నాఁక, ని యధికంబుగఁ బీడించు లేవరాదు, పదినెలలకష్ట
మియ్యది పార్థివేంద్ర! ౩౩

క॥ ఈకష్టములకుఁ దలఁకి యా, నేకసుఖమ్ములను విడిచి యేకాంతగతిం
గైగొని మునీశ్వరులు తప,మాకాంక్షించెదరు గర్భ మతిదుఃఖదమౌ

క॥ ఒకకల్పమేనియును నా, రకమున వసియింప వచ్చు రాజా! గర్భం
బకటకట! దుఃఖబహుళం,బొకక్షణమేనియును దాననుండుట భరమౌ

గీ॥ దారుణం బగుయోనియంత్రమ్ము వెడలి,పడుట యొకకష్ట; మామీఁద
బాల్యమునం ద, నేకములు గష్టములు; సెప్పనేల దీని, నేవగింతురు
తత్త్వజ్ఞు లెఱుకకలిమి. ౩౬

గీ॥ యజ్ఞదానతపోజన్య మైనసుకృత, కలన స్వర్గంబు గల్గుఁ జంచలము
గాని, యదియు నిత్యంబు గాదు పుణ్యంబు క్షీణ,మైన నట నుండ
నింద్రునకైనఁ జనదు. ౩౭

గీ॥ కృతశుభాశుభకర్మముల్ కేవలాను,భావ్యములు దాటఁగా రావు
బ్రహ్మకైన, విష్ణు నెత్తిన యవతారవిధ మదెల్లఁ, గర్మవశ మని
యెఱుఁగు మిక్కము నృపాల! ౩౮

క॥ రామావతారమునఁ గప,లై మహి నావిర్భవించి రమరులు; కృష్ణం
బా మధుసూదనునకుఁ దో,డై మెలఁగిరి యాదవు లయి యాహవ
భూమిన్. ౩౯

గీ॥ బ్రహ్మచేఁ బ్రేరితుం డయి పద్మనేత్రుఁ, డెత్తు నవతారములు ధర్మ
మెసఁగఁజేయఁ, బ్రతియుగమ్మున నవతారఫలము హరికి,రాక్షసవినా
శమును ధర్మరక్షణంబు. ౪౦

క॥ శ్రీకృష్ణుచరితము సుశ్లోకము పుణ్యప్రదంబు శోభనము లస
చ్ఛ్రీకము శృంగారరసవ్యాకీర్ణము సర్వలోకవంద్యం బధిపా! ౪౧

గీ॥ యదుకులమునందు వసుదేవుఁ డవతరించె, గశ్యపునియంశమున
శాపకారణమునఁ, గలిగె గోవృత్తి; కశ్యపుకాంత లదితి, యును
సురసయును శాపానుయుక్తఁ జేసి. ౪౨

గీ॥ దేవకియు రోహిణియు నాఁగ భూవలయము,నందు నక్కయుఁ జెల్లెలు
నై జనించి, రనుడు జనమేజయుం డను మునివరేణ్య!, కశ్యపున కేల
శాపంబు కలిగెఁ జెపుమ. ౪౩

ఆ॥ వె॥ అతనిభార్య లైనయదితియు సురసయు, శాప మందనేల జగద
ధీశుఁ,డైనహరియు మానుషావతారం బెత్తి,గోకులమున నేల
కోర్కెఁ జెందె. ౪౪

క॥ వైకుంఠవాసుఁ డగుహరి, గోకులమునఁ బుట్టి వింతకోర్కెల శుద్ధ
పాకృతచర్యల మెలఁగుట,కేకారణ మెఱుఁగఁ జెప్పవే మునివర్యా.

ఉ॥ మానవజన్మమన్నఁ గడు మాన్యము గా దది గర్భదుఃఖము
ఖ్యానుగతంబు దానికి మహామహుఁ డౌహరి సమ్మతించి యె
న్నో నవతారముల్ గొనుచు నెంతయుఁ గుందఁగ నేల! రాముఁడై
కాననమందు మున్ పడినకష్టముకన్నను గష్ట మున్నదే. ౪౬

ఉ॥ గోవులఁ గావఁడో! వెడఁగుగొల్లలకొంపలలోఁ జరింపఁ డో!
చావునకుం దలంకి తనజన్మగృహంబు పరిత్యజింపఁడో!
చేవ గలట్టికంసుని నశింపఁగఁ జేయఁగఁ గష్ట మందఁడో
యేవగఁ జూచినన్ సుఖము కృష్ణునికిం గనుపట్టదింతయున్. ౪౭

వ॥ అనవుడు వ్యాసుం డిట్లనియె.

క॥ హరి యవతరించుటకు నో, నరపాల! యనేకకారణంబులు గల వా
దరమున విను వసుదేవుని, చరితమ్మును సతినిసతులచారిత్రమ్మున్.

వ॥ ఒక్కనాఁడు కశ్యపుఁడు యజ్ఞార్థంబుగ వరుణుధేనువుల నప
హరింప నతండు గుపితుం డగుచుఁ బరమేష్ఠికడకుఁ జని యిట్లను. నాధే
నువులు కశ్యపాపహృతమ్ములగుకతనఁదదీయతర్ణకంబు లడలెడి «మాతృ
హీనమ్ములైనయీవత్సంబులంబోలె నీతనిభార్యలును దుఃఖింతురుగావుత"
మని మఱియు నదితిం గుఱించి మృతవత్సవై కారాగారనివాసినివైకుందు
మని శపించిన విని నీరజాసనుండు గశ్యపు రావించి యిట్లనియె. ౪౯

గీ॥ ఈవు లోభగుణం బూని యితనిధేను,వుల హరింతువె! ధర్మంబు
పొలియదే! యె, ఱింగియును నింద్య మైనపనిం గణింప, నేనిసీబుద్ధి
కేమన నౌను మాని! ౫౦

వ॥ యుక్తాయుక్తంబు లెఱింగియు నెఱుంగనిగతి ననుచితం బొనరించితివి గాన భార్యలిరువురితోఁగూడ యదువంశమ్ము నంబుట్టి గోపాలకత్వం బొనరింతువు గాక యని శపించి మఱియు నిట్లనియె.

క॥ ధరణీభారంబెల్లను, హరియించెడివాఁడు పరముఁ డాద్యుఁడు హరి సు
స్థిరవైభవుండు నీకుఁ గొ, మరుఁడై జనియించు లోకమాన్యుం
డగుచున్. ౧౨

వ॥ దితియు నొక్కెడ నదితిం గాంచి "నీకుం గుమారు లేడ్వురుదయించి నశింతురుగావుత" మని శపించె ననవుడు వ్యాసునకు జనమేజయుం డిట్లనియె. ౧౩

క॥ దితి యేల శపించె మరు, త్పతిజనని నదితిని దనదుభగినిన్ నాకుం
గతి మోఁగింపు మనుడు భూ, పతి కిట్లని చెప్పఁ దొడఁగె వ్యాసుఁ
డు పేర్మిన్. ౧౪

వ॥ రాజేంద్రా! దక్షునికొమిరె లగుదితియు నదితియుఁ గశ్యపునకు భార్య లందు నదితికి నింద్రుం డుదయించిన దితి తనపతి యగు కశ్యపుం గాంచి "ఇంద్రతుల్యపరాక్రముఁ డగుకొమరుం గరుణింపవే" యని ప్రార్థించుడు నతండు నట్లనుగ్రహించె నంత దితియు సంపూర్ణగర్భవతియై యున్నెడ నదితి దానికి సహింపక తనపుత్రుం డగునింద్రున కిట్లనియె. ౧౫

క॥ దితికడుపున నొకతనయుం, డతివీరుం డుద్భవించు నని కడుఁజింతా
న్వితనైతి వైశమే త, త్ప్రతిక్రియ యొనర్పు మనకు వలయుఁ గుమారా.
గీ॥ గర్భవతి యగునవతాలి గాంచి నామ, నంబు చింతాకులం బయ్యె
నాఁడునాఁడె, కలఁగెనే శాత్రవుఁడు రాజయక్ష్మపగిది, నుపశమింపఁగ
రాదను మ్మొకరిచేత. ౧౬

క॥ అనవుడు నింద్రుఁడు దితికడ, కనువుగఁజని మొక్కినాఁడు సాష్టాంగ
నమ, స్కారించి వినయమధురం, బును విషగర్భితము గాఁగఁ
బొరి నిట్లనియెన్. ౧౭

గీ॥ అమ్మరో! నీవు వ్రతపరాయణతఁ జాల, బడలి కృశియించితివి నీకుఁ
బాదసేవఁ, జేయ వచ్చితిఁ బెద్దలసేవకిన్నఁ, గలదె సుకృతంబు సకల
లోకమ్ములందు. ౫౯

వ॥ అని పాదమ్ము లల్లన నొత్తుచున్నెడ నాపె నిద్రించె నతండు
వజ్రింబు గొని. ౬౦

గీ॥ యోగబలమున గర్భంబు వేగఁ జొచ్చి, యేడుతెఱఁగుల ఖండించె
నిట్లొనర్ప, వజ్రధారాభిఘాతంబు వలనిబాధ, తాళఁజాలక శిశువు
రోదనము చేసె. ౬౧

వ॥ మఱియు నతండు మెల్లన "మారుద" యని నుడువుచు
నొక్కొక్క ఖండం బేడేడుతునుకలు గాఁ దునిమిన నాపెగర్భం బేకోన
పంచాశత్ఖండంబు లయ్యె నంత నదితియు మేల్కాంచి సపత్నియే యిం
దులకుఁ గారణం బని యెఱింగి కోపించి యిట్లు శపియించె. ౬౨

ఉ॥ పాతకురాల! గర్భమును భంగ మొనర్చినయట్టి నీతనూ
జాతుఁడు రాజ్యహీనుఁ డగు సత్యము గల్గినదాన నేని నీ
వాతురవై భవాంతరమునందును నిప్డును బంధనాలయా
పాతమునం గృశించి సుతభంగమునం దపియింప గాంచువే. ౬౩

వ॥ నాపుడుఁ గశ్యపుం డాలించి దితిం గాంచి యిట్లను "నోల
తాంగీ! కోపింపకు మీఖండమ్ము లన్నియు మరుత్తు లనఁ బరఁగి బలాది
కమునఁ బురందరసామ్యమ్మున నెగడెడి భవద్వితీర్ణం బగుశాపం బిత్త
లోదరి యష్టావింశ మ్మగుద్వారమ్మున మనుష్యాంశమ్మున ననుభవించు
నని చెప్పి మఱియును, ౬౪

చ॥ వరుణుఁడు శాపమిచ్చె మును వారనికోపము నూని నీవు నా
వరుసన శాపమిచ్చితి వవంధ్యము లియ్యవి తప్ప నేర్చునే
యిరువురశాపహేతువున నీసతి మానవయోనిఁ బుట్టు నో
తరుణి! కృపామతిన్ గను వృథాకలహమ్ము లడంచు శ్రీయమున్.

గీ॥ అని పతి వచింప నక్కాంత యద్దు సెప్ప, కూరకుండె నరేంద్ర! య
య్యాదిద యదితి, దేవకీదేవి యగుచు మేదిని జనించె, నెఱుఁగు
మిది శాపకారణం బింత నిజము. ౬౬

క॥ అన విని జనమేజయుఁ డిట్లనియెఁ నీచెప్పినట్టియాఖ్యానము వి
న్నను బాపరూపభవబంధనమునకుం దలఁకు నామనంబు మునీంద్రా!
గీ॥ కశ్యపునిపేర్మికొడుకు లోకముల నేలు, వాఁడు దేవేంద్రుఁ డిట్టి
యపాత్రికర్మ,మొనరిచె నటన్న నకట! తక్కొరులు పాప, ములకుఁ
దలఁకుదురె! భవాంబుధి మునింగి. ౧౮

వ॥ సంసారకారణంబునసకదా! మహాత్ములగు పాండవులు శ్రీకృష్ణప్రేరితులై యధర్మబహుళంబును దారుణంబును నగుసంగ్రామం బొనర్చి మహాత్ములును వేదవేదాంగపారంగతులును దేవాంశసంభవులును నగుభీష్మద్రోణాదులఁ బరువురఁ బరిమార్చిరి. ౧౯

క॥ సారవిహీనం బగు సం, సారం బని యెఱిఁగి దేవసములును ధర్మ
పారంభులు నగువారలు, నీరీతి నధర్మవృత్తి నెనయం దగునే.

## సంసారవిముక్త్యుపాయము

ఆ॥ వె॥ ధర్మ మనఁగ నేది! దానికిఁ దగు నాస్థ, యెట్టి? దది ప్రమాణ
మెట్లు లగునొ!, తెల్పు మయ్య వ్యాస! తెల్లమ్ముగా నిట్టి, కతల
కతన మనము గలఁకఁ జెందె. ౨౧

గీ॥ ఆప్తవాక్యంబు విశ్వాస్య మంటివేని, యాప్తుఁ డెవ్వఁడో తెలియఁగ
నలవి యగునె, విషయసక్తతఁ జెందిన పూరుషుఁడు రాగి, యగును
రాగంబు ద్వేషంబు ననుసరించు. ౨౨

క॥ తన కార్యము సాధింపం, గను ద్వేషం, బనృత మొదవఁ గాఁ జేయును వి, ప్రునిరూపము నెపమునఁ గొని, చనఁడె జరాసంధుఁగూల్ప
జలజాక్షుఁ డోగిన్. ౨౩

క॥ అతఁడు త్రివిక్రముఁ డయ్యు న్న, పతివని! యాకతనఁ గదె వామ
నుఁ డగుచు, శ్రుతి గాంచె ద్వారపా, లస్థితి కగ్గం బయ్యెఁ దద్వశీ
భూతుండై. ౨౪

గీ॥ ధర్మమునకాదిపదము సత్యంబు రెండవ, పద మెన్నంగఁ దగుశుచి
త్వంబు మూఁడ,వపద మెన్నఁగ దయ నాల్గవపద మెన్న, దాన మని
చెప్ప నెల్లబుధవ్రజంబు. ౨౫

వ॥ అట్టినాల్గుపాదమ్ములం దక్కనధర్మంబు నిలువదు ధర్మహీనం బగుకర్మంబు ఫలప్రదంబు గానేర దందు నిశ్చలుండు మృగ్యుం డని పలికి మఱియు నిట్లనియె. ౭౬

ఉ॥ దాత మహానుభావుఁడు శతక్రతుకర్త నయానయాది ని
ర్ణేత జితేంద్రియుండు రమణీయచరిత్రుఁడు వేదమార్గసం
స్థాత ధరాసురాదిజనతానుతుఁ డౌబలిచక్రవర్తి నా
రీతి నధర్మమార్గమున శ్రీహరి వంచన సేయు టొప్పునే. ౭౭

వ॥ ఇం దధికుం డగు బలియో! హరియో చెల్వు మనవుడు సాత్యవతేయుం డిట్లనియె. ౭౮

గీ॥ మాయ పన్నినకపటవామనునికన్న, నాడి తప్పక మేదిని యఖిల
మతని,కిడినబలి యుత్తముం డని యెన్నఁ దగదె,ధర్మమున నొండు
గలదె సత్యంబు దక్క. ౭౯

గీ॥ తీర్థములు సారెసారెకుఁ దిరుగఁ గాక,జన్నములు తేప తేపకు సలు
పుఁగాక, దానమతి మాటిమాటికిఁ బూనఁగాక, సత్యవంతున కే
వాఁడు సాటి వచ్చు. ౮౦

వ॥ త్రిగుణాత్మిక యగుమాయ బలవతి యగుకతన సాంసారికునకు సత్యంబు దుర్లభంబు; నిస్సంగులును నిష్పరిగ్రహులును వైఖానసులును నగుమునులకు సత్యంబు సుసాధం బట్టివారల యుంట దృష్టాంతంబుగాఁ గలరు తద్భిన్నం బగునఖిలజగంబును మాయాశబలిత మ్మగుచు మోహాంబునిధిం దరింప గామి భ్రమించుచుండుఁ గార్యార్థి యగుసంసారికిఁ గపటం బవశ్యకర్తవ్యంబు; దానం బాపంబు సంభవించుఁ, గామక్రోధలోభాదులు బలవంతంబు లగుటఁ దనఁ గర్తవ్యాకర్తవ్యమ్ముల నెఱుంగ నీవు; విభవమ్మువలన నహంకారంబును నహంకారంబువలన సంకల్పవికల్పమ్ములును నాశాతృష్ణాదైన్యదంభంబులును నసూయయు మున్నగాఁ గలదుర్గుణమ్ములు పెక్కు సంభవించుఁ గాన సంసారికి మహామోహావ్యాసం బడక తీరదు. ౮౧

గీ॥ మనము పరిపక్వమై శుద్ధి గనదయేని, ధనము న్యాయార్జితం బయి తగదయేని, శత్రుపక్షంబు దూరమై చనదయేని, వాఁ డొనర్చిన కర్మంబు వమ్ము సుమ్ము. ౮౨

గీ॥ కర్త ద్రవ్యంబు దేహంబు కారయితయు, శుద్ధులై యున్నఁ గర్మంబు శుద్ధిఁ జెందుఁ, గాని విపరీతము లయినఁ గర్మఫలముఁ గూడ, విప మగుజూవె కురువరేణ్య! ౮౩

కం॥ తనవృద్ధియుఁ బరహానియుఁ, గనఁ గర్మం బాచరించు ఘనులందఱు నెక్కొని తత్త్వగుణశుద్ధిని గనకున్నఁ బ్రమాద మొదవుఁ గర్మమ్మునకున్.

వ॥ ప్రాజాపత్యు లగు దేవదానవులు కార్యార్థు లగుకతన సదా పరస్పరవిరోధమ్మునం బ్రవర్తింతురు. గుణత్రయసముద్భూతు లగు దేవమనుష్యతిర్యగాదులకుఁ బరస్పరజాతివైరంబు స్వాభావికంబు; అహంకారసముత్పన్నం బగు నీసంసారమ్మునందు రాగశూన్యుం డుదయించుట కల్ల యని మఱియు నిట్లనియె. ౮౪

ఆ॥ వె॥ వేయి మాట లేల విశ్వంబు సర్వంబు, మోహమయము రాగమూల మగుచు, నాదియుగమునంద యలరారె నింక నీ, కలియుగమ్ము చెప్ప నలవి యగునె. ౮౫

కం॥ ద్రోహ మొనర్చినవానికి, ద్రోహం బొనరింప నిరువురుఁ సములే యద్రోహికి ద్రోహ మొనర్చిన, ద్రోహాత్మునికన్న జగతి దుష్టులు కలరే!

వ॥ సుకృతవంతులకుఁ గృతయుగమ్మును గలిపురుషులకుఁ గలికాలంబును మధ్యములకు మధ్యమయుగంబులును నిర్ణీతంబులు; అందు నొకానొకఁడు వాసనావశమ్మునఁ గలియందును ధర్మాత్ముఁడు కాఁగలఁడు ఏయుగమ్మునను ధర్మంబునకుఁ బూర్వజన్మవాసనయ కారణంబు. ౮౬

గీ॥ సత్యసంధులు మును లతిశాంతు లగుచుఁ, గాననమ్ములఁ దపములు పూనియుండ, మఘువునంతటివాఁడు పెన్మచ్చరమున, వారినియమమ్ములకు భంగపా టొనర్చు. ౮౭

వ॥ ఇందులకుఁ బురాతనం బగు నొకయితిహాసంబు గలదు.

గీ॥ ధాతమానసపుత్త్రుండు ధర్ముఁ డనెడి, బ్రాహ్మణుఁ డొకండు వేదసంపన్నుఁ డతుల, ధర్మతత్త్వజ్ఞుఁ డలరు నాతఁడు పదుగురు, దక్షసుతలను బెండ్లాడె ధర్మరతుల. ౯౧

వ॥ వారితోఁ గృహస్థధర్మంబులం బ్రొద్దు పుచ్చుచు హరికృష్ణనరనారాయణు లనునలువురఁ దనయులఁ గాంచె నందు హరికృష్ణులు యోగాభ్యాసరతు లైరి. నరనారాయణులును. ౯౨

నరనారాయణులు తపం బొనర్చుట

శా॥ మంచుంగొండకు నేగి చేసి రచటన్ మందాకినీతీరమం దంచన్మంజులకుంజభాగముల నధ్యాసించి లోలోన 'నో' మంచున్ మించుగతిం దపం బొకసహస్రాబ్దంబు; లద్దాన గం పించెన్ సప్తకులాచలంబులును క్షోభించెన్ దిశాచక్రమున్. ౯౩

క॥ ఘోరం బగుతప మానర,నారాయణు లిట్లొనర్ప నాకవిభుఁడు పెం పారుభయమ్మున మనమున, వారితపశ్శ్రీలు భంగపఱుపం దలఁచెన్.

వ॥ తలఁచి యైరావతం బెక్కి గంగాకూలమ్మునకుం జని యచట నరుణద్వితయంబువడువున బ్రహ్మవిష్ణువులచందంబున వైశ్వానరద్వయంబుపగిదిఁ దపంబొనర్చుధర్మతనయులం గాంచి గజంబు డిగ్గి డగ్గఱికుం జని యి ట్లనియె. ౯౪

ఉ॥ ఏమి మనంబునం దలఁచి యిట్లు తపం బొనరించుచున్నవా రో మహనీయులార! మదినున్నవరంబు వరింపుఁ డయ్య సు త్రాముఁడ నేను వచ్చితి భరం బని యెంచక, చాలు నింక మీ ఘోరతపంబు మాకు సమకూర్చెను సంతస మెంతయేనియున్.

ఆ॥ వె॥ కోరఁ దగనిదైనఁ గోరుఁ డొసంగెద, ననుచుఁ బల్కు హరివచనములకును, మాఱు పలుకరైరి మహనీయు లతిజప, ధ్యానగరిమ మదినిదవులు కతన ౯౫

క॥ పలుకనిమునులం గని బి,ట్టలుకం బాకారి వారిధ్యానాసక్తిన్, బొలియింపఁగ నొకమాయన్, గలుగంగాఁ జేసె నంతఁ గలుషితమతియై ౯౬

క॥ పులులుం బాములు సింగం, బులునుం దోడేళ్ళుం జిఱుతపులులున్
బెలుచన్, గలిగెను దన్న్యాయాబలు, విలసనమున వేలకొలందిఁ వెరఁ గొ
దవంగన్. ౯౯

గీ॥ పుష్కలావర్తకంబుల ఘోరుకొలిపె, దావదవమును నద్దెసల్ దవులు
కొలిపె, నంధతమసంబు నల్గడ నాక్రమింపఁ, జేసె ఱా ల్గురిపించె
విశేషరీతి. ౧౦౦

క॥ నరనారాయణు లీగతి, మరుదధిపతి గడలుకొల్పుమాయకు భయ
పడం, బొరయక తమయంతన ను, స్థిరమతులై యుంట చూచి
చెచ్చెర నతఁడున్, ౧౦౧

గీ॥ కోరువర మిచ్చెద నటన్నఁ గోరరైరి, వాసకును నెండకును భీతిఁ బూన
రైరి, పులుల కేపియు మదిలోనఁ దలఁకరైరి, వీరితపమున కెట్లొకో
విఘ్న మనుచు. ౧౦౨

వ॥ వితర్కించి తత్తపోతిశయమ్మున కచ్చెరువంది సనాతనియు
జగదీశ్వరియు నగుసంబవాగ్బీజమాయాబీజకామబీజంబులు జపియించు
మహాత్ములతపంబున కంతరాయంబొనర్ప నెవ్వండు సమర్థుం డని యో
జించి నాకమ్మునకుం జని వసంతమన్మథులం బిలిపించి యిట్లనియె.

క॥ ధ్యాయత్సత్త్వులు నరనా, రాయణు లనువారు బదరికాశ్రమమం
దు, త్యాయతరీతిఁ దపంబున్, జేయుచునున్నారు మనకుఁ జేటొ
దవంగన్. ౧౦౪

ఉ॥ వారితపంబు భంగపఱుపం జని యేను “వరంబు లిచ్చెదన్
గోరుఁ” డటన్న నాదుపలుకుల్ చెవిఁ బెట్టక పోయి రంత దు
ర్వార మదీయమాయఁ గనుపట్టినవానకుఁ బెద్దగాలికిన్
గ్రూరమృగ[illegible] మదిని గొంక రొకింత యదేమివింతయో. ౧౦౫

ఆ॥ వె॥ అంత నేను వారి దైనతపంబును, భంగపఱుప లేమి బెంగఁ గొ
నుచు, నేగుదెంచి దీని నేరు సాధింప లే, రంచు మిమ్ముఁ బిలువ
నంపినాఁడ. ౧౦౬

క॥ కావున నిర్జరకార్యము, గావింపఁగ నీవు దక్కఁ గలవా రేరున్
భావింప లేరు నీయను,భావం “బిదమిద్ధ” మనఁగ నచ్చెను మగవా!

గీ॥ హరిహరబ్రహ్మముఖులు నీయంపగముల, దాడి కోర్వక దాసానుదాసు
లైరి, జగము లన్నియు గెల్చినజాణ వీవు, మనుజు లన నెంతవార
లోమదన నీకు. ౧౦౮

ఉ॥ సంతస మూని వే మనవసంతునితోఁ దగునట్టియప్సరః
కాంతలతోడఁ గూడి చనఁగావలెఁ గావలె సిద్ధి; వేల్పురా
వంత రవంత నీమది కవశ్యము రావలెనయ్య మార! నీ
యంతటివాని కెంతఘన మైనది యంతటికార్య మెంచఁగన్. ౧౦౯

గీ॥ రంభ మొదలగునప్సరోరమణులందు, నొక్కరిత యిట్టిపని చేయ
నోపు నట్టి, దంతు నీకు సహాయమై యుండ నెంత, లేసి తపములకై
సను వాసి చెడదె. ౧౧౦

వ॥ అని యనునయపూర్వకమ్ముగఁ బల్కునతనికి మదనుం డిట్లను.

క॥ దేవా! దేవరయానతి, గావింపఁగఁ గింకరుండు గలఁ డైనను నా
భావమ్మునఁ గలభయసం,భావన తెల్లముగఁ దెలియఁ బఱచెదవినుమీ

గీ॥ హరిహరబ్రహ్మలను జిత్తమందు నిలిపి, తప మొనర్చెడిశివసుత
పము పాడు,చేయఁ గలఁ గాని దేవిని జిత్తమందుఁ, దలఁచుతపసుల
వంచింపఁ దరము కాదు. ౧౧౩

శా॥ ఏవారైన మదీయబాణములఁ బే ర్చెత్తించి యుంకించి త
ద్భావమ్ముల్ గలఁగించి తత్తపములన్ భంగంబు గావింతుఁ గా
నీ వాలాయముఁ గామబీజమెదలో నిత్యంబు ధ్యానించు నా
దేవీభక్తులవంకఁ బోవుటకు సందేహింతు దేవాధిపా! ౧౧౪

క॥ నరనారాయణు లనుము ని, వరు లియిరువురును శక్తిభక్తులు విను
మో, మరుదీశ్వర! నాశరముల, కరయం గుఱి గారనన్ బలారాతి
యనున్. ౧౧౫

క॥ మాయాబలమున్ననైన ను, పాయముచేనైన నీ వపాయము గన కే
యేయనువుననైనను సుమ,సాయక! యీ దేవహితము సాధింపఁదగున్

వ॥ నాపుడు మదనుండు మారాశక రంభాదులతో బదరికాశ్ర
మంబుపొంతకుం జనునంత వసంతుండును మున్న తదాశ్రమంబు ప్ర
వేశించె. ౧౧౭

మ॥ చివురుంగొమ్మలతో రసాలములు పుష్పించె దిరేఫాళి ‘‘ఝుం
ఝువు” మంచుజ్ బ్రతిసూనగుచ్ఛముపయిజ్ జూడజ్ దగెజ్ మించి;పం
డువు గావించెను గర్భయుగ్మములకుజ్ బుంస్కోకిలారావ; మొ
క్క వసంతుండు తదాశ్రమావనితటిజ్ గాలూఁదు నాలోపలజ్.

## ⋙ వసంత ప్రవేశము. ⋘

క॥ పొగడలు తమాలములు మో, దుగులుజ్ దిలకాగములు మధూక
ములు గెం,జిగురుంబూవులతోఁ ద,న్నగమున నింపుం దనర్చె నయ
నమ్ములకుజ్. ౧౧౮

సీ॥ లత లన్నియును బుష్పవతులై నగంబుల నంచితంబుగఁ గాఁగిలించు
కొనియె, మందమ్ములై మంచిగందంపుఁదావితోఁ జెలరేఁగి నునుగా
డ్పులలముకొనియె, రాల ముగ్గినపండు గాలించి మెసవుచుఁ గొదమ
చిల్కలదండు కూయఁదొడఁగెఁ,బండుటాకులమీఁదఁ బడెడిపూవుల
చాలు పండువెన్నెలభాతిఁ బరిఢవిల్లె; గీ॥ నాలుమగలెల్ల మొల్ల
మాపూఁ జాల, లీల నొదవఁగఁ జేయనీరాలలోన,నించువిల్లాని చె
య్వు లగ్గించుకొనుచు, సంతసింపఁగ సాగి రాసమయమందు. ౧౨౦

గీ॥ ఇట్లు వసంతుండు మున్న యచ్చటను జెలఁగఁ, బంచబాణమ్ములును
గేల నించువిల్లుఁ, దాల్చి యప్సరసలు వెన్నుఁ దన్నిరాఁ ద, దాశ్రి
మము సేరె సుమబాణుఁ డభయుఁ డగుచు. ౧౨౧

ఉ॥ మాత్రికులు మోసులెత్త గరిమ న్నెలతా ల్గరఁగంగఁ గోటరా
నీకనివాసమై తగుషణిపత్రికరంబు కరంబు వేడ్కతో
నూఁకొనఁ గోకిలల్ ప్రీతిరవోదయముం బొనరింపఁ బాడి ర
వ్యాకులలీల నప్సరస లమ్మెడ రమ్యలయస్వరంబుగజ్. ౧౨౨

వ॥ ఇట్లకాలవసంతోజ్జృంభణంబున మంజులతరగీతంబును గోకి
లారవంబును శిలీముఖధ్వానంబును జెవులకుం దవిలి తెప్పలు విప్పి నలు
దెసలు చూచి నరనారాయణు లిర్వురును గాలధర్మవిపర్యాసమ్మునకు
విస్మయం బందుచుండిరి. ౧౨౩

గీ॥ కుజము లన్నియుఁ బుష్పించెఁ గోకిలార, వమ్ములును దుమ్మెదలవిరా
వమ్ములును భ, రమ్ములై నిండె నీభూధరమ్ము నిండ, నన్న! చూచితె
యిది యెంత యద్భుతంబొ. ౧౨౪

గీ॥ శిశిరఋతువనుగజరాజుశిరము తనప, లాశకుసుమమ్ము లనుగోరులన్
గలంచి, యరుగుదెంచె వసంతసింహం బటంచు, దోఁచుచున్న ది
దేరిచాతుర్యమొక్కొ. ౧౨౫

సీ॥ అరయ రక్తాశోకకరయుఁ బలాశాంఘ్రికయును నీలాశోకకచయు నీల
నీరజనయనయు వారిజవదనయుఁ గుందద్విజయు బిల్వకుచయు మంజ
రీకర్ణయును జపాశ్రీకాధరయు నీపవసనాన్వితయు సిందువారనఖయు
గోకిలాలాపయుఁ గేకికలాపయు సారసస్వననూపురారవయును;
గీ॥ రమ్యవాసంతికాబద్ధరశనయు మద, హంసగమనయుఁ బుత్త్ర
జీవాభిధాన, లోమలతయును నగుచు నీలో వసంత, లక్ష్మి సం
ప్రాప్తమయ్యె సలక్షణముగ. ౧౨౬

చ॥ సమయము గానిచో నిటు వసంతము వొల్చుటఁ జూడ నస న్
యమగుతపంబు వో నడప నాకవిభుం డొనరించినట్టి కృ
త్రిమగతి తోఁచుచున్న దమకిన్మృదుగానరవంబు విన్కిఁ జే
సి మది గలంగఁ బాటెఁ బరిశీలన చేయక యుంట పాడియే. ౧౨౭

ఉ॥ శీతలవాతపోతములు చేతము దన్పుఁగఁ జొచ్చెఁ గోకిల
వ్రాతము గీరసంతతి మరాళసమూహముఁ గేకిబృందముల్
గూఁతల మెప్పొనర్చ మనకుం గడు మోస మొనర్ప నెంచి స్వ
ర్ణేతయ పంపఁబోలుఁ దరుణీతతి నింతయు నిక్కునం బగుల్.

వ॥ అనుచు నారాయణుండు ప్రశంసించుచుండు నెడ.

సీ॥ పదియాఱువేలయేఁబదిమంది మేనకాముఖ లచ్చరలు వెన్క ముందు
నడువ, నళిమయుం బగునారియూరజంబున మించు నిక్షువిల్లు బు
జాన సంధనించ, మకరందరసము చిమ్ముఁగఁ జాలుసుమబాణముల
గముల్ దూణీరములఁ జెలంగఁ, గుల్కుకోయిలదండు చిల్క తేజీబారు
కలకలమనుచుఁ జక్కటిసటింప; గీ॥ వచ్చి తమకట్టెదుట నిల్వఁబడిన

మదను, నచ్చెను వాకింత మనమున నాదుకొనఁగఁ, గాంచి రొన
రించుతపము చాలించి ధర్మతనయు లిరువురు సంతస మినుమడింప.

గీ॥ దివ్యభూషణరుచి దశదిశలు వెలుఁగ, మునుల కెఱుఁగుచు సురధన
వనజముఖులు, మానవులు విన దుర్లభమైనపాటఁ, బాడ సాగిరి కా
మవివర్ధనముగ. ౧౩౦

వ॥ వారియాట పాటలకు విస్మితు లగుచు వా రిట్లనిరి.

ఉ॥ మిమ్ము వసంతమన్మథుల మీపతి యైనబలారి మాముని
త్వమ్ము గలంచి మాతపము భ్రష్టము సేయఁగఁ బంపినాఁడు చి
త్తమ్మున నీసుతో; నవితథంబుగ గుత్తుఱుఁగంగవచ్చెఁ గా
ర్య మ్మెటులైన మాపలుకు లారయుఁ డాదరమేమరంబుగన్.

ఉ॥ దూరమునుండి వచ్చితిరి తొయ్యలులార! పరిశ్రమంబు చే
కూరెడిఁ గాన మాయొసఁగుకొంచెపువిందుల సేద దేరి యిం
పారఁగ నస్మదాశ్రిమమునందు వసింతురుగాక యూరకే
మీ రిట కేగుదెంతురె తమిన్ త్రిదశేశ్వరుఁ డంపకుండినన్.

క॥ పాకారి మాతపమ్ముం, జీకాకొనరింపఁ జేసి చెఱుపఁగ నంపెం, గాక
మిము గణికలార! వ్రాకులు మీ రెంత! తపము భ్రష్ట మొనర్పన్.

క॥ నూసామర్థ్యం బరయుఁడు, మీసౌందర్యమ్ముకివి మించం దగుబల్
వాసి కలదాని గలుగం, జేసెద మొకతన్వి మీకు సిగ్గు ఘటింపన్.

వ॥ అని నారాయణుండు కుడితొడ కేలం జఱచినమాత్రిన య
ప్సరోమణి యగునూర్వశి చెలులతోడం బుట్టె నిట్లనన్యసామాన్యలావ
ణ్యంబునం బొదలునక్కన్నెం జూచి దేవసామాన్య లందఱును మాన్యం
బగునమ్మునిమహిమమ్మున కచ్చెరువడుచు నిట్లనిరి. ౧౩౭

చ॥ ఎఱుఁగక మీమహామహిమ మెగ్గొనరించి తపంబు భంగముం
బఱుపఁగ వచ్చియున్నమము మన్నన సేయుఁడు తొల్లి యెంద ఱొం
దఱొ మహనీయు లైనమునినాథుల నస్మదపాంగపాతముల్
చెఱుపఁగ లేదె మీదరికిఁ జేరవు మీమహిమమ్ము లింతలే.

వ॥ అదియునుంగాక నారాయణాంశసంభూతు లగుమహానుభావు
లని యెఱింగియు నిందుఁ ద్రిండు భవత్తపోభంగమ్మునకు మమ్ముంబనుచుట

యస్మదీయపురాకృతభాగ్యోదయంబ కాని యొండు గాదు భవాదృశు
లిట్టితుచ్ఛసుఖంబులకుఁ జిరకాలార్జితం బగుతపంబు వమ్మొనరింతురే
యని నుతించుదేవవేశ్యలం గాంచి చిఱునగ వంకురింప నిజతపఃకాం
తులు శరీర మలముకొన జితకామలోభం బగుమనమ్మున సంతస ముప్పొం
తిలఁ నరుండు విన నారాయణుం డిట్లనియె. ౧౩౮

క॥ వేగమ మీలోకంబున, కేఁగి మదీయోరుజాత నీయూర్వశి మీ
రాగోత్రారికిఁ గానుక, గాఁ గైసేయుండు శుభముగాఁ దగుమీకున్.

గీ॥ "దేవతలకెల్ల శుభ" మంచు "దేవవిభున, కతులితానంద" మంచు
నారాయణుండు, నరుఁడు దీవించి రంచు విన్నపము సేయుఁ డేగుఁ
డచ్చరలార! మీయెడకు నపుడు. ౧౩౯

క॥ పలుకుల విన్నాణపుఁ దీ, పొలుకఁగఁ బయ్యెదలు మూయు నుంకిం
చుచు న, చ్చలలోచనాంత లిట్లని, రెలమిన్ గేల్మోడ్చి యమ్మునీం
ద్రుని తోడన్. ౧౪౦

ఉ॥ తావకపాదపద్మములు దాపురఁ గాఁపురముండి త్వత్సమా
సేవనమాచరించుచును శ్రీల రహింపఁగ వచ్చినట్టిమే
మావల కెట్లు పోయెద మహో! యిటు లాడఁగఁ జెల్లునే మునీం
ద్రా! వధరించి మాహృదయతామరసమ్ము తెలర్పఁ జేయవే.

క॥ భవదూరుజాత లగునీ, యువతీమణులెల్ల మేల్మి నూర్వశితో నా
కవిభుం గన నేగెద రే,ము వసింతుము నీసమీపమునన మునీంద్రా!

వ॥ నావుడు భవదభీష్టం బెయ్యది యనుడు వార లిట్లనిరి. ౧౪౧

చ॥ చనలును భూమియుం గలిసి చన్నఁ దపోధను లాశ తప్ప రీఁ
గఁ దలఁచితేని మాకుఁ బతిగా నినుఁ గోరెద మొప్పుమయ్య! యే
మనవతిమాటకై సఁ బెఱమాట వచించుట వాడి గాదు మే
మదియునుఁ గాక మన్మథశరాసారదగ్ధల మాదరింపవే. ౧౪౨

ఉ॥ కమ్మనివింటిజోదు చెలికాని హిమాంశుని గూడిమాడి దే
హమ్ము నహమ్ము మీఱఁ బువుటమ్ముల నెమ్ములు గాడఁ జించి గా
యమ్ము లొనర్పఁ జొచ్చె హృదయమ్ముల నీచరణాబ్జయుగాలము
న్నమ్మిన దేవకాంతల సనాథలఁ బ్రోవఁగ నెంచు టొప్పదే. ౧౪౩

క॥ నాకమ్ము విడిచి మిమ్ముఁ, జేకొని సుఖవార్ధిలో మునింగెద మంచున్
మీకాళ్లఁ బడినవేలుపు, గోకామినులఁ గ్రహింపరో మునిచంద్రా!

క॥ అని వనటం బడు, వేలుపువనితలసరసానులాపవైఖరి చిత్త, మ్మున
గలఁకపఱుప నారా, యణమునిచంద్రుండు పల్కు నవ్వారలతోన్.

క॥ సీతునకుఁ గాలి కెండకుఁ, జేతంబు సహింపఁ జేసి చేసినతపమున్
మీ తారుణ్యమ్ముల పా, ల్సేఁత యుచితమగునె వేల్పుచేడియలారా!

✽ తత్త్వవిచారము ✽

వ॥ అదియునుంగాక మతిమంతు లగువా రేతాదృశగార్హస్థ్య ధర్మంబులం బరివర్జింతురే యనునారాయణున కచ్చర లిట్లనిరి. ౧౪౯

మ॥ విను మోహసో! మునిరాజ! మాపలుకు; స్వర్వేశ్యాకుచస్పర్శసం
జనితానందవశీకృతుండవయి స్వేచ్ఛావర్తనన్ గంధమా
దనభూమీధరమందు సంతతసుఖాద్వైతమ్ముగా నుండుమ
య్యనిమేషాలయమైన నింతకు గడున్ హాళిన్ బొసంగించునే.

వ॥ నావుడు దత్వచఃపరిసంగంబుల కచ్చెరువడుచు నమ్ముని యిట్లు తలపోసె, నహంకారంబు సంసారవృక్షమ్మునకు మూలంబును ధర్మహరణమ్మునకుఁ బ్రథమకారణమ్మును నని తెలిసి యీవారాంగన లస్మత్తపోభంగమ్మునకే తెంచిరని యెఱింగియు మానమ్మున నుండక ధర్మవినాశంబుగఁ దదధికసుందరం బగుసుందరీగణంబు సృజించుటయుఁ దదీయసరసాలాపగోష్ఠి నుంటయు నన్నింతకుఁ దెచ్చె నీమహామోహపాశమ్మున బద్ధుండనై యూర్ణనాభిచందమ్మునఁ గదల లేక కష్టమ్ములకుం బాల్పడితి, నకటా! యింక నైన నీవిచారంబు విడిచి శాంతంబుఁ బరిత్యజించి కోపాకులుండనై యీసుందరులం దఱిమెద నని యనుకొనియు మరలఁ గోపమ్మునకన్న వైరంబు వేఱొండు గనుపట్టదు దగోద్ధితం బగు నలం బద్దాని దహించునట్లు దేహంబునం బుట్టుగోపంబు దేహంబు దహించు నెట్టిహింసకు నైన వెఱవదు నరకాదులకు సాధనం బగు నని తలపోసి యతికర్తవ్యతాశూన్యుండై కుందుచున్నయతనిం గని యయ్యనఘుతలం పెఱింగి నరుం డిట్లనియె. ౧౫౧

క॥ కోపము చీఁకటికూపము, కోపము పాపముల కాదిగురువగు హింసా
 ధూపము కోపము గావునఁ, గోపింపం గూడ దేరికిఁ గొలకైన సఖా!

వ॥ మున్నహంకారదోషమ్మున సహస్రదివ్యవత్సరమ్ములు ప్రహ్లాదునకు మనకుఁ బోరగుట యెఱుంగవే! శాంతంబునన యీసుందరులం బనుపుము నావుడు నారాయణుం డతిశాంతుం డయ్యె నని చెప్పిన సాత్యవతేయుం గాంచి జనమేజయుం డిట్లను. సుకృతియు ధర్మాత్ముఁడు నగుప్రహ్లాదునకును దపోనైష్ఠికు లగుధర్మతనయులకును సంయుగంబు గలుగఁ గతం బేమి! తపోధర్మంబులం బరిశ్రమంబుదక్క నిట్టులైన నొండు గలుగ నేర్చునే! క్రోధలోభమాత్సర్యాదులకు మూలం బగునహంకారంబు సత్యయుగంబునందును మహాత్ములచిత్తంబు నాయత్తం బొనర్చిన నింక జపతపమ్ములు కలవే! సూర్యునియెదుటఁ దమంబుభంగి నహంకారమ్మున కెదుట సుకృతంబు నిలువ నేరదు. లోహనిగళబద్ధుల కైన విముక్తి గలుగుఁగాని యహంకారావృతులకుఁ గలుగ దని మఱియు,

మ॥ నరనారాయణు లట్టిపెద్దమును లన్నా! యిట్లహంకారదు
 ర్భరులై యుండఁగ నస్మదాదులవిచారం బేల! చిత్తమ్మహం
 కరణాయత్తము గాకయున్నన రు లేకాలమ్మునన్ వేరు సం
 సరణం బాహమికంబు దీనఁ బరమజ్ఞానంబు చేకూరునే. ౧౫౮

వ॥ చరాచరాత్మకం బగునీయజాండం బంతయు నహంకారదోషదూషితం బగుచు మూత్రపురీషమయం బగుసంసారమ్మునం బడి పరిభ్రమించుచున్నయది. రాగశూన్యులును మహానుభావులును నగువారు నయితము కామక్రోధాదులకు లోనై చరించుచుండు రేతాదృశం బగుకలికాలమ్మున నస్మదాదులకుఁ దరణోపాయం బానతిమ్మనుడు సాత్యవతేయుం డిట్లనియె. ౧౫౯

క॥ యావదజాండ మహంకా, రావిర్భూతంబు గాన నందలిగుణముల్
 నూవె సమస్తబ్రహ్మం, డావృతిఁ దగుఁగార్యభేద మగునె నరేంద్రా!

క॥ పటమునకుఁ దంతుగుణమును, గటకాదులకును సువర్ణగత మగు
 గుణ మ, ట్లిటులే మాయాగుణలం, పట మగుచు నజాండమెల్ల
 మసలుచునుండున్. ౧౬౧

వ॥ హరిహరాదు లగు దేవతలును వసిష్ఠాదిమునులును నగాధం
బగునీసంసారకూపమ్మునం బడి వనధివీచీగతం బగునౌకచందమ్మునఁ దడఁ
బడుచుందురు. ఈ రేడులోకమ్ములందును దేహి యగువాని నహంకారసం
భూతమ్ము లగుకామక్రోధాదు లాశ్రయింపక మానవు. ౧౫౮

సీ॥ సకలవేదాంతసంహితల్ చదువుఁగాక, నిఖలశాస్త్రప్రసంగముల్
నేర్చుఁగాక, పుణ్యతీర్థమ్ము లెన్నేనిఁ బోవుఁగాక, విషయసక్తుఁ
డౌనర్పనివిధులు లేవు. ౧౫౯

వ॥ కృతాదియుగత్రయమ్మునందును గామమోహమదాన్వితు
లకుఁ బూర్వాపరవిచారంబు లేదు. కలియందు విశేషంబుగ స్పర్ధా
ద్రోహమదమాత్సర్యాదులు పాదుకొని దేహిం బాశనిబద్ధునిచందమ్మున
గ్రుంగఁ జేయుచున్నవి. ఏతాదృశం బగుసంసారమ్మున నరిషట్కంబు
జయించినమహాత్ము లెవ్వ రని చెప్పు పారాశర్యునకు జనమేజయుండిట్లనియె.

క॥ వారతిధన్యులు వారని, వారణకృతసుకృతఖనులు వారు కృత
సదాచారులు వారు జితేంద్రియు, లేరికిన్ మోహాదికమ్ము లెదు
రక యుండున్. ౧౬౧

మ॥ కలఁకన్ జెందుమనంబు మజ్జనకుఁ డల్కన్ మానికంఠమ్మునన్
గలిదోషమ్మున నొక్కపాము నసుహీనంబుం బడన్ వైచె నన్
బలుకుం బాపకరంబు లోఁ దలఁచుకొన్నన్; దండ్రి యేరీతిఁ ద
త్ఫలమున్ జెందక యుండునట్టితరణోపాయంబు చింతింపవే. ౧౬౨

వ॥ అని సందహ్యమానమానసుం డగుచుఁ గొంతవడిఁ జింతించి
మరల సుప్రసన్నమనస్కుం డగుచుఁ దదుదంతంబు సాంతంబుగ నానతి
మ్మనుడుఁ దన్మనంబు నరనారాయణకథానకకథనంబునం బ్రసన్నం
బొనర్ప నెంచి యిట్లనియె. ౧౬౩

క॥ మును నరహరిరూపంబున, దనుజారి హిరణ్యకశిపు దానవు ఖండిం
చినపిదపఁ దత్తనూజా, తునిఁ బ్రహ్లాదుని ననిందితునిఁ దనభక్తున్.

సీ॥ జనకునగరమునకు నొగి స్వామిఁ జేసి, "ధర్మరక్షణ మింతేనిఁ దప్ప
కుండ, నేలుకొను" మన నాతఁడు నేలుకొనియెఁ, బైతృకం బగురా
జ్యంబు ప్రీతిఁ దలిర్ప. ౧౬౪

ఉ॥ వారక పాఱు లాదియగువర్ణము లన్నియు స్వస్వవృత్తిసం
చారముతోడ సేవ్యపరిచర్య యొనర్చుచునుండి రెచ్చటన్
జారులుఁ జోరులున్ బిశునసంతతివారును లేరు కారుణీ
పూరకుఁ డాహిరణ్యకశిపుప్రభవుం డిల యేలుపట్టునన్. ౧౬౬

సీ॥ ఇటు కొన్నినాళ్లు పైతృకరాజ్యపాలనం బాచరించినృసింహునాజ్ఞ
కతనఁ, బాతాళలోకంబు పాలింపఁగా నేగి యచట నాతండున్న
యంత నొక్క, దినమున భృగుమునితనుజుండు చ్యవనుండు నర్మ
దానదికి స్నానంబొనర్పఁ, గా నేగి దిగి మున్గఁగా నందు విషభయం
కర మగునొక్కనాగంబు గడఁగి; గీ॥ తపసికాయంబు వట్టి పాతాళ
మునకుఁ, దీసికొని పోవ మౌని భీతిల్లి దీన, రక్షకుం డగుసరసిజా
తాక్షు మదిని, బాదుకొల్పి నుతించె 'మాంపాహి' యనుచు.

చ॥ ఇటు నుతియించునమ్మునిపయిన్ దయ గల్గి సరోజనేత్రుఁ డ
క్కటికము సూపఁ దద్విషవికారము దాపసి కెక్కదయ్యె నం
తట "ముని శాప మిద్ది" యనుదండడిఁ బా మతనిన్ ద్యజించెఁ ద
జ్జటి యురగాంగనల్ ముద మెసంగఁగఁ గొల్వ హసించె నయ్యెడన్.

వ॥ ప్రహ్లాదుం డొక్కనాఁ డతనిం గాంచి యుచితసత్కారం బొనర్చి రాక్షసవైరి యగునింద్రుండు తనమర్మంబుల నెఱుంగుట కంపిన దూతగా శంకించి వినయమ్మున "నీరాకకుం గతం బే" మనుడు నతం డతనిసందియం బెఱింగి యిట్లనియె. ౧౬౯

మ॥ దనుజేంద్రా! వినవయ్య! స న్నమరదూతం గాఁ గసంబోల దిం
ద్రునితోడం బని యేమి నాకు! భృగుపుత్రుండన్ "బలరాతి పం
పె" న టంచున్ మదినెంచఁ బోకు మిదె పేర్మిన్ జెప్పెదన్ నాచరి
త్రను; నిక్కం బగుబుద్ధితోఁ గని సుహృద్భావంబు చూపం దగున్.

ఉ॥ ఏ నొకనాఁడు నర్మదకు నేగి జలమ్ములఁ గ్రుంకుచుండ నా
మే నొకపాము వట్టికొని మీభువనమ్మున కీడ్చి తెచ్చె న
న్యానరమాధినాథకరుణోదయ ముండుటఁ జేసి తద్విష
గ్లానియు నా కొకించుకయుఁ గన్పడకుండె సురారివల్లభా! ౧౭౧

ఆ॥ వె॥ నాఁటఁగోలె నీదునగరమ్మునన యుంటిఁ, గాన వలదు వేఱుగాఁ
దలంపు; విష్ణుభక్తులందు విమలుండ వైననీ, దర్శనంబు గలిగె
దానఁ గాదె. ౧౭౨

వ॥ నావుఁడు హరిభక్తసందర్శనజనితానందపరవశుం డగుచుఁ
బ్రహ్లాదుం డిట్లనియె. ౧౭౩

గీ॥ సకలలోకాటనంబును సలుపునట్టి, దివ్యముని వీవు గావున దేవలోక,
మందు భువియందుఁ బాతాళమందుఁ గాని, కెలయు తీర్థమ్ము
లానతీవే మహాత్మ! ౧౭౪

వ॥ మీతిరుగనితీర్థమ్ములును మీఁగుబ్రింకనినదులుం గలవే యను
నాతనికిఁ జ్యవనుం డిట్లనియె. ౧౭౫

క॥ ప్రతిపదమునఁ దీర్థము వి, శ్రుత మగువాఙ్మనసకాయశుద్ధులకు
మనో,యతి లేనిమలినమతులకు,దితిజాధిప! కీకటంబు దేవాపగయున్

ఆ॥ వె॥ మొదలఁ జిత్తశుద్ధి యరి కలదేనిఁ దీ, ర్థమ్ములెల్లఁ బావనమ్ము
లగును, జిత్తశుద్ధి లేనిచెనఁటుల కెట్టితీ, ర్థములు పమ్మ టంచుఁ
దలఁపు మధిప! ౧౭౭

గీ॥ పట్టణములెన్ని! యూళ్లెన్ని! పల్లెలెన్ని!, గంగయొడ్డునఁ గల వటఁ
గాఁపురంబు, లున్నకైవర్తకనిషాదహూణయవన, ముఖ్యులకునెల్ల
దొరకునే ముక్తి పదవి. ౧౭౮

క॥ గంగోదకపానము సే, యంగానే కాదు గంగ కరిగి యచట మఱి
గంగానే కాదు మనం, బుం గ వలె నిర్మలంబు మునులకు నైనన్.

గీ॥ తీర్థవాసంబు కష్ట మాతీర్థములను, బాతకము కొంచెమేని యపార
మగును,ఎచటఁ జేసినపాపమ్ము లెడలుఁగాని, తీర్థకృత మగుపాపము
లీఱ వనఘ! ౧౮౦

గీ॥ సర్వతీర్థాటనముకంటె సకలభూత, దయయు సత్యంబు శౌచంబు
దప్పకున్కి, యధిక; మిది యున్నవారికి నఖిలతీర్థ, రాజములు ప్రతి
పదమునఁ దేజరిల్లు. ౧౮౧

వ॥ ఐనను భవదీయం బగు సంప్రశ్నంబున కుత్తరంబు వినుము
నైమిశంబును జక్రతీర్థంబును బుష్కరంబు ననునివి పుడమియం దధి

కమ్ము లితరతీర్థమ్ములు లెక్కింప నలవిగా దనవుడుఁ బ్రహ్లాదుఁ డాతీ
ర్థమ్ము లాలోకింప సపరివారమ్ముగ వెడలి నైమిశంబుం బ్రవేశించి యు
చట స్నానదానాదికంబు లాచరించి యది మొదలు తీర్థసంసేవనంబు
గావించుకొంచుఁ జనునాఁడు ముందట. ౧౭౨

ప్రహ్లాదనరనారాయణయుద్ధము

చ॥ కనియె సరస్వతీనది సకారణపాతకహారివారిమ
జ్జనకృదపారతాపసవశంవదతీరవిరాజమానకుం
జనమదనూనసూనచయసౌరభవాసితనీరజాతసం
జనితమరందపానవశసంకులనిత్యరణద్ద్విరేఫము౯. ౧౭౩

ఆ॥ వె॥ కాంచి యచట సర్వకర్మముల్ నెఱవేర్చి, తత్తటమ్ముపొంతఁ
దరలి చనెడి, దైత్యరాజసుతునిదారి కడ్డమ్ముగా, నొకటఁ గాన
నయ్యె నొక్కమఱ్ఱి. ౧౭౪

వ॥ దానం గొన్ని నైకరూపమ్ము లగునంపగములం గాంచి "పావ
నం బగుఋష్యాశ్రమంబున వీని కవకాశం బే"మని విచారించుచున్నెడ.

సీ॥ దండ దండంబు గమండలువును దగ నమ్ములపొదియు శరాసనంబు
నెదుట నింపెసలారఁ గృష్ణాజినమ్ముపై యోగమ్ముమైఁ గూరుచున్న
మునులు, పరతత్త్వనిధ్యానపరులు నున్నతజటాభారమ్ముచేఁ గప్పఁ
బడినవారు, గన్పట్ట దైత్యేంద్రుఁ గడు నల్కతోఁ గను లుదయ
దర్కప్రభాయుక్తి దెలుప; ఆ॥ వె॥ నిట్టులనియె "నేల యీదంభ
తపము! ధ, ర్మమున కిదియె తెఱువు! మునులె మీరు!, తపముసేఁత
విల్లు ధరియించు టెచటేని, ధరణిఁ గలదె దంభ ధర్ములార!

వ॥ అని పలుకుదైత్యేంద్రుం గని మందహాసమ్ముతో నేకస
క్కెమ్ముగ నరనారాయణు లిట్లనిరి. మా తపంబు గొడవ నీ కేల
యేము బ్రాహ్మణోత్తముల నిష్ణాతుల మైనకతన నిట్లుంటి మని యె
ఱుంగరాదె పాపమ్ము మిన్నక విప్రవైరంబునకు రాకుము. ౧౭౭

చ॥ అన విని యాతఁ డిట్లను నహంకృతి మీఱఁగ "మందబుద్ధులా
ర! నను గణింప కీవెడఁగుఁబ్రల్లదముల్ పలుక౯ దపంబు పెం

వున సుకృతప్రచారమునఁ బోలఁదురే నను! సంగరంబు సే
యన మదియేనిఁ జేయుఁడు రయమ్మున మీఁగరువంబు మాపెదన్.

క॥ అలుకమెయి నిట్లు దైత్యుఁడు, పలుకఁగ నరుఁ డిట్టు లనియె బవర
మొనర్పన్, దలఁపేరి రమ్ము తల వ్రియ్యలు సేసెద ననుడు భ్రు
కుటి యదర నసురయున్. ౧౮౯

శా॥ హుంకారమ్ము చెలంగ హస్తమున నిష్వాసంబు గైకొంచు జ్యా
టంకారమ్మున దిగ్గజశ్రుతులు బీటల్ వాఱ పెంపేద నిశ్శం
కన్ బాణము దొడ్గి యేసె నరుఁడున్ జాపంబు చేఁ బూని సా
హంకారుం డయి తున్మెఁ దచ్ఛరము బాణాసమ్ముతో వముఁగన్.

ఉ॥ కొండొక విల్లు పూని మునికుంజరువక్షమునందు నేయ నా
తండును వాఁడికోలఁ గొని తద్భుజమధ్యము గాడ నేసె దై
త్యుండొగి సొమ్మసిల్లి మఱియున్ బెనుతూపుల నమ్మునీంద్రు మై
నిండఁగ నేయఁ ద్రుంచెఁ దపనీయశరమ్ముల వాని నన్నిటిన్. ౧౯౧

ఆ॥వె॥ గర్జితములతోడఁ గాలాంబుదమ్ములు,గుములు గట్టి సోనఁ గుఱియు
పగిది, నరునిమీఁద దైత్యనాథుండు హేమపుంఖమ్ము లైనయా
శుగములు పఱపె. ౧౯౨

వ॥ ఇట్లు పరస్పరజయాకాంక్షు లగుమునీంద్రదైత్యేంద్రులబవ
రమ్మునఁ దత్సమాలోకనసమాగతామరీస్వ
దుర్భరాయమాణమానసులు దివౌకసులు కుసుమంబులు గుఱిసిరి.

క॥ ఇగుపురుఁ బఱపెడిశరములు,నరుణునిమండలము గప్ప నంబరభూమీ
చరు లగునసురులు నరులును,జిరమఱ్ఱాడంగఁ గటికిచీఁకటి గప్పెన్.

క॥ నారాయణమునియున్ దే,వారి శరాసనము నొక్క యాశుగమునఁ బెం
పారన్ దునిమిన దైత్యుఁడు,వారక యింక నొక్క విల్లు వడిఁ గైకొనినన్

క॥ మరలన్ నారాయణుఁడా, శరాసనము ద్రుంచెఁ దునుమఁ జయ్యన
నతఁడున్, బరిఘమ్ము నేసె నాతని, యురమున; వ్రేటు వడి యతఁడు
నుక్కు పొసంగన్. ౧౯౫

వ॥ ఒక్క వాఁడితూపున నప్పరిఘంబు ద్రుంచె దైత్యుండు గద
గైకొనుడు నయ్యదియుఁ దునియలుగా నేసె నేతాదృశం బగుఘోర

యుద్ధంబు దివినుండి దేవగంధర్వాదు లగ్గించిరి. నారదుండును ద్వార
కా సురకుమారసంగరంబుపగిది వృత్రాసురేంద్రులయుద్ధంబువడువున
మధుమాధవులబవరంబుచాడ్పున నానందంబు సంధించె నని పర్వతు
నితోఁ బ్రశంసించె నిట్లు సహస్రదివ్యవత్సరమ్ము లహోరాత్రమ్ములు ప్రహ్లా
దునకును శార్ఙ్గాజగవధరులగు నమ్ములకును బోరు ఘోరంబయ్యె నంత.

సీ॥ శంఖచక్రగదాదిసాధనంబులు నాల్గుకరములఁ దనరారఁ గళము
నందు, వనమాల వ్రేలఁ బచ్చనిపైఁడిపుట్టంబు గట్టినవారఁ గారు
కమ్ము గ్రమ్మ, పసిడి వైకుంఠుండు ప్రత్యక్షమైనఁ బ్రహ్లాదుండు మది
బత్తి పాదుకొనఁగ, బవరంబు మాని తత్పాదద్వయంబుపైఁ బడి
మొఱఁగిన రమాపతియు నతని; గీ॥ గాంచి ''మీరు మదీయులు గాన
నీ క, జేయు లని తెల్ప దైత్యుండు సిగ్గుగొనుచు, మునురకు నెఱఁగి
చనియె నమ్మునులు సూడ, బుండరీకాక్షుఁడును దిరోభూతుఁ డయ్యె.

క॥ అని చెప్పిన వ్యాసుం గని, జనమేజయుఁ డనియె ''నిట్లు చనునే యని నె
క్కొని సేయఁగ నరనారా, యణమునులకుఁ దపముకల్మి వ్యర్థము
గాఁగన్. ౧౯౯

వ॥ ఏ కేకతమ్మున నహంకారంబు వాయదు కందమూలాశనం
బుల వనమ్ములం గృశించి యనేకదివ్యవత్సరమ్ములు తపంబు సాధించిన
యిమ్మహాత్ములఁ కింత యహంకారం బొప్పునే యనుడు వ్యాసుం డిట్లను
నహంకారంబు శరీరంబునకుఁ గారణం బట్టిశరీరధారుల కహంకారంబు
వాయదు హరిహరాదులకు నయిత మహంకారంబు దుస్తరంబు తొల్లి
తద్దోషమ్మునన కాదె పురుషోత్తమునకు భృగుశాపమ్మున నానాయోను
లందు జన్మంబు ఘటించె ననుడు జనమేజయుం డి ట్లనియె. ౨౦౦

క॥ భృగుశాపము హరికిం గ, ల్గఁగఁ గారణమేమి! యతఁడు గలిగిన
చోటుల్, జగమున నెయ్యవి! వినిపిం, పఁగదే యనుపాండవునకు
వ్యాసుం డనియెన్. ౨౦౧

వ॥ అట్లు ప్రహ్లాదుండు కయ్య మ్మొనర్చి పరాజితుండై నిర్వేద
మ్మునఁ బౌత్రుండును విరోచనసుతుండును నగుబలికిం బట్టమ్ము గట్టి గం
ధమాదనమ్మునకుం జని తపమ్ము సేయుచున్నంత బలి యయ్యమరులన్

జయించిన విష్ణుసహాయు లగుచు వా రబ్బలి నోడించి స్వస్థానం బేలి కొనిరి. అమరపరాజితు లగుదైత్యులు తమగురుం డగుశుక్రాచార్యు పాలికిం జని యిట్లనిరి. ౨౦౨

శా॥ అంతేవాసుల మైనమ మ్మమరు లత్యంతప్రతాపమ్మునన్
వంతం బొందఁగఁజేయుచుండి రిది సంభావ్యంబు గాదేనిఁ బ్రా
ణాంతం బౌ నిఁక మాకు; నీమహిమచే నాదిత్యులం గెల్చి మా
వంతం బాపఁగదే సురారు లను బ్రోవం జూడవే భార్గవా! ౨౦౩

క॥ గురుఁడవు బహుమంత్రవిదు,త్తరుఁడవు మాపాలిదైవతమ వీసురలన్
బరిమార్పకున్న బ్రతుకం, దరమే పరమాపదబ్ధి దరిఁజేర్ప గదే.

క॥ అనుడుఁ గావ్యుఁడు దైత్యుల, కును నభయం బిచ్చి నెమ్మి గొలిపినఁ దద్వా, ర్తను విని సుర లింద్రునితో, ననిరి భయం బెదకు సందియమ్ము ఘటింపన్. ౨౦౪

వ॥ శుక్రమంత్రప్రభావమ్ముకలిమి నసురులు మన కజేయు లగుదురు కాన నేఁడ చని యనిం దెగటార్చి హతశేషులం బాతాళమ్మున కనుచుట కర్జం బనిన నింద్రుం డనుమతించె సురలును బరాక్రమించి యసురులం దాఁకిన వారు సంత్రస్తు లగుచు శుక్రునిశరణుఁ జొచ్చిరి. అతండు మంత్రప్రభావమ్మున సురలం దరిమి యసురుల కిట్లనియె. ౨౦౬

సీ॥ అసురులు! వినుఁడు సరసిజాతభవుఁడు దా మును నాకుఁ బేర్మిఁ
జెప్పినవిధంబు, సురపతిపాలిదై హరి దైత్యుల నడంచు ననియె
నప్పల్కు తథ్యమ్ము గాఁగ, మనహిరణ్యాక్షు నవ్వనజాతనేత్రుండు
కోలరూపము దాల్చి క్రొవ్వడంచె, నరసింహరూపమ్మున హిరణ్య
కశిపుని సమయించె నాతఁ డసమబలుండు; గీ॥ మంత్రిబలమునఁజేసి
యమరుల గెల్తు, నీశ్వరునిఁ దృప్తుఁ జేసి యభీష్టసిద్ధి, నంది వచ్చెద
మీ రంద ఱంతదనుక, నాపదల కోర్చికొనుఁ డన నసురు లనిరి.

క॥ బలియురు దేవ్లిరి యిఁక మ, ర్బలులము యుంటిమి సుపర్వబల
ములమెదుట, న్నిలువఁగ నోపుదుమే! యీా, చులుకదనమ్మునకు
నోర్చి శుక్రాచార్యా! ౨౦౮

వ॥ నావుడుఁ గావ్యుం డిట్లనియె. మహాదేవువలన నేను మంత్ర విద్యాభ్యాసం బొనర్చి వచ్చునంతకు మీరలు వనమ్మున శమదమాన్వితులై తాపసులపగిది నుండునది. ౨౦౯

దేశకాలబలమ్ములు తెలిసి సామ, దానముఖభేదము లెఱింగి తాను
యుక్తిఁ, జేసి పగఱకుఁ బరిచర్య చేసియైన, నశుభకాలంబు గడవఁ
ద్రోయుంగవలయు. ౨౧౦

ఆ॥ వె॥ పగఱ గెల్వఁ జాలుబలముగల్గిననాఁడు, పగఱతోడఁ బోరు పఱ
పవలయు, లేనినాఁడు సామదానాద్యుపాయమ్ము, లాచరించి
యశుభ మాఁగవలయు. ౨౧౧

క॥ కావున మీరలు మీమీ, తావులకుం బోయి సామదానాదులఁ గా
ర్యావసర మెఱిఁగి కపటప్రావీణ్యము దాల్పుఁ డేను వచ్చెడి వఱకున్.

వ॥ అని యొడం బఱిచి శుక్రుండు తపంబునకుఁ జనియె నసురులును దమవంశవృద్ధగుప్రహ్లాదుపాలికిం జని యిట్లనిరి. ౨౧౩

ఉ॥ తాతవు సత్యవాదివి సధర్ముఁడ విచ్చట నచ్చుటన్ దట
స్థాతవు ప్రీత్యయమ్మువలనన్ గడుఁ బెద్దవు నీవు నిర్జర
వ్రాతమువంకఁ బోయి యసురప్రకరంబు శరంబు మీయెడన్
బ్రీతిఁ జరించుఁ జాపము ధరింపదు కేల నటంచుఁ దెల్పుమా.

క॥ అని వేఁడినఁ బ్రహ్లాదుం, డనిమిషు లున్నెడకు నరిగి యసురులు
మీతో, "ననిఁ జేయము చాపము చే, తను దాల్పము వైరబుద్ధి
దలఁప" మటంచున్. ౨౧౪

క॥ తెలుపు మనిరి వారలు వల్కలములు ధరియించి వనములం దాప
సులై, తలఁపుల నైనను వైరము, దలఁపక యుండు టిది యెల్లఁ దథ్యం
బనుడున్. ౨౧౫

వ॥ నిర్జరులును దదీయవచనప్రీత్యయమ్మునం గతమత్సరులై యుండి రంత రక్కసులు దంభతపోనియమమ్ము లాచరించుచుఁ గశ్యపాశ్రమమ్మున సుఖం బుండి రిట శుక్రుండు మహాదేవుంగుఱిచి తపమ్మొనర్చిన నమ్మహాత్ముండు దృగ్గోచరుండు గా నమస్కరించి యిట్లనియె.

క॥ సురలకుఁ బరాజయమ్ము న, సురులకు విజయం బొనర్చుశుభమం
త్రము నా, దరమున నా కిమ్మనవుడుఁ, బరమేశ్వరుఁ డిట్లు మదిని
భావించె వెసన్. ౨౧౮

క॥ క్రతుభుక్కులయెడ నితఁ డప, కృతి సేయఁ దలంచె వారి కేగతినైనన్, గతి కల్పించు టుచిత మని, యతిదయ గలఁ డగుచు నిట్టు
లనె నెప మొదవన్. ౨౧౯

క॥ తలక్రిందుగఁ బొగఁ ద్రావుచు, నలయక వేయేండ్లు కడు నియమ
మునఁ దపమున్, బలువిడిఁ గావించిన నీ, తలఁపు న్నెఱవేర్తుఁ
బొమ్ము తడయక శుక్రా! ౨౨౦

వ॥ శుక్రుండును దదాజ్ఞప్తవిధానంబున ధూమపానం బొనర్చు
చు నధోముఖుండై తపంబు సేయుచున్నంత నమరులు కర్ణాకర్ణికగా
నీవృత్తాంతమ్ము విని దంభతాపసు లగురక్కసులపైఁ గవిసి చేయునది
లేక శరణుఁ జొచ్చినవారి కి ట్లనిరి. ౨౨౧

గీ॥ పశుపతిగుఱించి మేటితపం బొనర్చి, మంత్రసిద్ధిని గైకొని మమ్ము
గెల్వ, వలయు నని యెంచి గురు నటు పంచి కపట, మగుగతిఁ
జరించు టదియు మా కరయ రాదె. ౨౨౨

వ॥ మీరు నిక్కపుశరణార్థులు గారు గాన మీయు క్కడఁగిం
చెద మనుడు నసురులు భీతులై కాలికొలఁది పలాయమాను లగుచుఁ
గావ్యమాతృ నభయంబు వేఁడిరి. సురలును వారిపిఱుందన చనువారు
ముందఱ శుక్రజననీరక్షితు లగువారిం గాంచి యాఁపెచే వారితు లయ్యు
బలాబలమ్ములు గణింపక చుట్టుముట్టిన నామె నిద్ర యనునొక దేవత
నంపించె నదియుఁ గడఁగి మోహాయత్తుం జేయ నింద్రుండు భయం
పడి విష్ణుశరీరమ్మునం డాఁగిన నిద్ర యట కఱిగి క్రోధతామ్రానన య
గుచు ని ట్లనియె. ౨౨3

క॥ ఓరిదురాత్మక! విష్ణుశ, రీరమునన్ డాఁగినంత మృత్యువు నిన్నున్
జేరక పోవునె వీనిశ, రీరముతోఁ గూడ నిన్ను మ్రింగెద ననుచున్.

వ॥ కవిసిన నింద్రుండును భయ మందుచు మహాత్మా! తపోబల
మ్మున గరీయసియు ననివార్యయు నగునిక్కావ్యమాతం గముకొని వైళమ

సంహరింపుమి మన కుపద్రవంబు వాటిల్లు నని హరిం బ్రార్థించినంత భక్తవత్సలుం డగుముకుందుండు చక్రంబుం బ్రయోగించిన. ౨౨౭

క॥ భగభగ మని మంటలు గ్రి, మ్మంగ నాచక్రంబు గాస్యమాతశిరమ్ముం దెగ నటికె నిద్రితోడన్; విగతజ్వరు లైరి దివిజవీరులు సంతన్.

**భృగువు హరిని శపించుట.**

క॥ భృగుసతి తమచే మృతిం బొం, ద గదాధరవజ్రధరులు తద్దయు మదిలో, మగువం జంపినకతమున, భృగుఋషి శపియించు ననుచు భీతిలుచుండన్. ౨౨౯

క॥ సురనాథునికారణమున, హరి తనమగునను వధించె ననువాక్యము నిర్దరవైరులు చెప్పంగ విని, కరమాక్రోశించి భృగువు కనుసన్న మొయిన్

వ॥ వచ్చి సరోజాక్షునిం బిలిచి "పదిమార్లు మానుషయోనులం బుట్టి జనన మరణదుఃఖమ్ము లనుభవించుచు వగలం బొగులు" మని శపించె ననుడు జనమేజయుండు "భృగుమునికి సురల విదురత్వంబు వాసినకత నెఱింగింపవే" యని యడిగిన ద్వైపాయనుం డిట్లను. అట్లు శపియించి భృగు మునియును దనకమండలూదకం బంగుష్ఠపుష్పంబునం దాల్చి యిట్లనియె.

ఉ॥ ఏను దపోబలాన్వితుండ నేని మదీయకమండలూదకా
 హీనబలంబు పెంపునను యీ నని తాను శిరి యింకలోన స
 త్ప్రాణయుగన్ దపోనియమసత్యసధర్మఋషీయమ్ములన్ గనుం
 డోసురులార! దైత్యసురయోధపతంసములార! యం చొగిన్. ౨౩౦

క॥ తలయును మొండెము నేక, స్థలమునకుం జేర్చి మంత్రజల మొక్కింత, జిలికినమాత్రసయాభృగు, లలనామణి బ్రతికె దైత్యులన్ ముద మొనయన్. ౨౩౧

వ॥ ఇట్లు లబ్ధజీవ యగుకళత్రముం గైకొని యతం డుండె నిం ద్రాదిసురలు తాపసుం డగుశుక్రునివలనిభయమ్మునకు నగుచుం దమ తమయధిష్ఠానమ్ములకుం జనిరి. ఇంద్రుండు తనకూతు నగుజయంతిం జూచి యిట్లనియె. ౨౩౨

క॥ తనయా! నిను శుక్రాచా, ర్యున కిచ్చితి గంధమాదనోర్వీధరమం, దు నతండు తపంబున నుం,డినవాఁ డన్నగమునకుఁ గడిందిరయమునన్.

క॥ చని యతనిమునకు న, చ్చినయుపచారములఁ దనిపి చేతఃప్రియుగా, నొనరించుకొనితపోనియు,తి నడంచినుదీయాభయముతీర్చుముతల్లీ!

చ॥ అనుతనతండ్రిమాట విసయమ్మున నూఁకొని యాజయంతి గ్రక్కున విబుధారిదేశికుఁ డకుంఠితలీల వసించుగంధమాదనమున కేగి యచ్చట నుదారగతిం దపమాచరించు నాతనిఁ గనిమోక్ష మహామహుని దత్త్వవిచారపరాయణాంతరుక్.

సీ॥ స్నానమునఁ దొడవుఘుర్ణజలంబు వోవఁగఁ గదళీదళమునఁ జక్కఁగ
విసరి, మధురసుగంధిశీతలవారిపూరంబు తివిరి పానార్థంబు దెచ్చి
యిచ్చి, భగభగ మనుపట్టపగలింటియెండ పైఁ బడకుండ వసనంబు
గొడుగుఁ జేసి, యాఁకటికై పక్వమైనసన్యాహారములను సంపా
దించి యుపాయము గొలిపి; గీ॥ దర్భలు చిప్పల్లఁ బఱచి మెత్తండనమ్ము,
వనిపిముకరం బొనస్సుతల్పంబు గూర్చిఁ, దేశకాలమ్ము లెఱిఁగి
నిదేశ మెఱిఁగి, కవిశ శుశ్రూష చేసి సక్కన్నమిన్న. ౨౩౬

గీ॥ తత్తదుపచారములు సంకర్భ మెఱిఁగి, తపసి సేవించెఁ గాని యు
త్తన్వి శాప, భయముచేయి మదికి మనసభ్రాంతి గలుగఁ, జేయు
శృంగారచేష్టలు సేయ దామె. ౨౩౭

వ॥ మఱియు సుభాషిణి యగుజయంతి సమయానుకూలంబుగఁ బ్రీతిజనకమ్ము లగువచనమ్ముల నుతించుచు మునిమనోవృత్తి దెలియ నాతుఁడుం దగుతనతండ్రి యనిపినదూతల నేకతంబ విదితవృత్తాంతులం జేసి యనవరతము బ్రహ్మచర్యపరాయణయై యనేకవత్సరమ్ము లద్దైతేయగురునకు శుశ్రూష గావించుచున్నంతఁ బరమేశ్వరాజ్ఞప్రకారంబుగ నక్కాపున్నియమమ్మునకు సహస్రవత్సరమ్ములు సంపూర్తి యగుటయు మహాదేవుండు కరుణాతరంగితాంతరంగుం డగుచుఁ బ్రత్యక్షమై వరంబు వరింపు మనవుడు సురవిజయంబు మున్నగు నభీష్టవరమ్ములును తత్సాధకమ్ము లగుమహామంత్రమ్ములును నర్థించిన నతం డనుగ్రహించి యంతర్హితుఁ డగుడు భార్గవుండు సమీపవర్తినియు శుశ్రూషాపరాయణయు నగుజయంతిం గాంచి మందస్మితమధురభాషణమ్ముల నిట్లను.

చ॥ ఎవతెవు నీవు! నీదు కుల మెయ్యది! నీజనకుం డెవండు! ము
గ్ధవు నవయౌవనంబు కలదానవు మత్పరిచర్య సేయుచుం
టివి కత మేమి తెల్పుము కడిందిమనోరథ మైన సిద్ధిఁ జెం
దువర మొసంగువాఁడఁ బరితుష్టి యొనర్చితి నీవు మాకొగిన్.

క॥ నీమనమునఁ గలకోరిక, మేమెఱుఁగుదు మైనఁ దెలుపుమీ యన
నాసు, త్రామతనూజ మనమ్మున నా, మోదము చెంది లజ్జితానన
యగుచున్. ౨౪౦

క॥ దేవవిభుకూఁతుర జయం,తావరజన్మను జయంతి యందురు నన్నుం
గావించె భవదధీనగ, దేవవిభుఁడు నాఁటఁగోలె దేవరయొద్దన్.

క॥ పరిచర్య సలుపుచుంటిని, గర మనురాగంబు గలదు గార్హస్థ్యవిధిన్
చిరముగ నిను సేవింపఁగఁ,గరుణించి పరిగ్రహింపఁ గాఁదగుననుడున్

క॥ పరికిఁ గనుపడకుండఁగ, మారాగమవిహితసూత్రమార్గమ్మున సం
చార మొనర్చుచుఁగ్రీడా,పారమ్యము గొనెద నొక్కపదివత్సరముల్

ఆ॥ వె॥ అని జయంతితోఁ గృహమ్మున కేతెంచి, పెండ్లి యాడి మిగులఁ
బేర్మిదనర, దేవదానవుల కదృశ్యుఁడై తన్మయత్వంబుఁ జెంది
యుండె భార్గవుండు. ౨౪౪

వ॥ అసురులును గురుండు తపస్సిద్ధిం బడసి వచ్చిన తెఱంగు విని

క॥ చని శుక్రునిఁ గానక చిం, తను గొని వెదకుచు మనంబు తద్దయు
సం దే, హనిమగ్నము గాఁగఁ దమభ, వనములకుం జనిరి త్రిదశ
భయశంకితులై. ౨౪౬

క॥ దైతేయగురువరుఁడు తన, కూఁతుం గొని సర్వదృష్ట్యగోచరుఁడై క్రీ
డాతతుఁడై యుండుట పురు,హూతుఁడు తనయాత్మనెఱిఁగి యుత్సా
హమునన్. ౨౪౭

క॥ తమగురు వగుగురునిం గని, యమరుల కుపకృతి నొనర్చునవసర
మిది గా, న మహితభవదీయమతిమ, హిమ సూపఁగ వలయు
నంచు నెంతయు వేఁడన్. ౨౪౮

క॥ వాచస్పతియును దనమా, యాచాతుర్యమునఁ జేసి యంతట దైతే
యాచార్యరూపముం గొని,వే చనె నవ్వారియెడకు వేడుక మెఱయన్

వ॥ రక్కసులును దమయాచార్యునిరాక విని యెదుర్కొని నమ
స్కరించి ముకుళితకరకమలులై యున్నంత నమ్మాయాశుక్రుం డగు
వాచస్పతి వారలం గని కుశలం బడిగి యి ట్లనియె. ౨౪౯

చ॥ పురమథనుం దలంచి తపముం బొనరించితి ధూమపాయినై
వరము వరించితిన్ ద్రిదశవర్గము గెల్వఁగఁ జాలుమంత్రముం
గిరిశుఁ డనుగ్రహించె నిఁక గీ టడఁగింతము నిర్జరాళికిన్
బరమహితుండు చక్రికిని బ్రాణభయంబు మదిన్ గలంపఁగన్.

క॥ హరుఁడును నా కొసఁగినమం, త్రిరాజములు మీ కొసంగెదను
గ్రక్కున ని, ర్జరులవలన భయపడకుఁ డ, సురులార! యటంచుఁ గప
టశుక్రుఁడు గడఁకన్. ౨౫౧

క॥ అభయం బొసఁగిన రాక్షసు, లు భయము విడనాడి సౌఖ్యలోలు
పులై స్వీ, యభవనము లేగి రనఁ గురు, విభుఁడున్ ద్వైపాయన
మునివిభునకు ననియెన్. ౨౫౩

గీ॥ కపటశుక్రాకృతినిఁ గాంచి ఘనుఁడు గురుఁడు, చేసినవిశేష మేమి
యచ్చెరువు కాదె, సకల మెఱిఁగినయాతఁ డిట్టికృతి కియ్యకొనఁగ
నన్యులు సత్యవర్తనులు గలరె. ౨౫౪

క॥ ఛలకర్మవర్తనుని గురు,ననఘుం డను టెట్లు! లమరులన సత్త్వోద్భూ
తులుతద్గురుఁడిట్లయినన్,గలరాజసతామసులకుఁగలుగు నెబ్బుతముల్

గీ॥ హరివిరించిదేవేంద్రముఖ్యామరులు మ, హాత్ములు మునీంద్రులును
నసత్యప్రవర్త, నంబు గైకొన్నమనుజులు నాఁగ నెంత!, సత్య మన
నెద్ది! యద్దానిచర్య యెట్లు. ౨౫౬

చ॥ గురుఁడును వామదేవుఁడు నకుంఠితతేజుఁడు గాధిపుత్రుఁ డు
ద్ధురుఁడు వసిష్ఠుఁడున్ మొదలు తొల్లిటిమానులు పాపకృత్యసు
స్థిరమతులైరె యింద్రుఁడును శీతకరుండును వహ్నియున్ వెసన్
బరతరుణీమణీసురతభాజను లై రిఁక ధర్మ మెట్టిదో. ౨౫౭

గీ॥ ఎఱుక లేక చరించెడిహీనమతుల, కెల్ల జ్ఞానోపదేశంబు నీఁ గడంగు
పెద్ద లిట్లైన నెవ్వరీపృథివియందు,సదుపదేశకు లగుసత్యసంధు లనఘు

చ॥ హరిహరు లేమి పద్మభవనాకవిభుప్రముఖామరుల్ మునీ
శ్వరులు మఱేమి రాగ మనుసంద్రమునం బడియున్నవార లో
నరవర! రాగి యయ్యును గనంబడు నేరుపుకల్మి నొక్కొకం
డరయ విరాగి నా; వికృతు లబ్రమె దేహము దాల్చువారికిన్.

చ॥ అరయఁ బరోపదేశకృతులందు సమర్థుల కాని యెందు నొ
క్కరుఁడు ను గాన రాఁడు తనకార్యముపట్ల వివేకి; దేహముం
బొరసినవారికెల్లరకు మోహము తప్పమి నిక్కువంబు సం
సరణపుఁజర్య లీగతి నెసంగు ననాదిగ నెల్లవేళలన్. ౨౬౦

చ॥ హరి యొకవేళఁ దాఁ దపమునందుఁ జరించు మఱొక్కవేళ య
జ్ఞరతి నెసంగు నొక్కపుడు సాగరజావశుఁడై చెలంగు సం
గరపరుఁడౌ నొకప్పు డొకకాలమునన్ జయ మందు వేఱొక
ప్డరయఁ బరాజయమ్ము గొను నన్నియు సంసృతికితు లౌఁ గదా.

గీ॥ హరిహరవిరించిముఖ్యు లౌనమరులు ముని, వరులుఁ దమతమయా
యువు వఱలుదనుక, నెగడి మృతిఁ జెంది మరలఁ బుట్టఁ గలవార,
లెఱుఁగు మిట సంశయ మొకింతయేని వలదు. ౨౬౧

వ॥ దేహవంతున కెన్నటికినిఁ గామక్రోధాదికం బెడ తెగదు సం
సారంబు తత్సంకులంబు దాని నతిక్రమించుపురుషుండు మృగ్యుండు
సంసారభీతుండు దారపరిగ్రహణంబున కేని నొల్లఁ డని చెప్పి మఱియు,

చ॥ గురుతరుణీమణిం గలసెఁ గోరికమై హిమరశ్మి; భాతృసుం
దరి రమియించె నగ్గురుఁడు; తక్కొరులన్ గణియింపనేల! సం
సరణము రాగలోభమదసంకుల మయ్యెడ సంచరించునొ
క్కరుఁడును ముక్తి కేగఁ డటుగానఁ ద్యజింతురు దాని నుత్తముల్.

గీ॥ కాన సంసారమున లేశమేని సార, మరయక త్యజించి జగదంబ
ననుసరింప, వలయు నేయంబమాయలోఁ బడి జగంబు, మదిరఁ జవి
గొన్నభంగి నున్మాద మెనయు. ౨౬౨

చ॥ చిరమతి నంబికార్చనము సేసి గుణంబులత్రు ళ్లడంచున
న్నరుఁ డెనయున్ విముక్తిని జనస్తుత మానగజన్మ మెత్తి శాం

కరిని యజింపఁడేని కడఁకన్ దుదిదాఁకను నిచ్చె నెక్కి సు
స్థిరత యెలర్పమిన్ బడినతీ రగు వానివిధంబు భూవరా! ౨౯౬

క॥ కావున నప్పర దేవీ, సేవామతులైనవారు జీవన్ముక్తి, శ్రీ వెలయుదు
రనవుడు "గురుఁ డావిధి శుక్రుఁ డయివ ంచనాయత్తమతిన్. ౨౯౭

వ॥ ఏమి చేసె" నావుడు జనమేజయునకు వ్యాసుం డిట్లనియె.

గీ॥ కపట మెఱుఁగక శుక్రునిగాఁ దలంచి, యమరగురువాక్యములఁ
గడు నాస్థఁ దవిలి, దైత్యు లున్నెడ శుక్రుఁడు తాఁ దలంచెఁ,దనదు
శిష్యుల నార్తుల దయ దలిర్ప. ౨౯౮

క॥ అమరు లొనరించు బాధల,శ్రమంపడుచు సారె నాదు రాకకుఁ జింతా
భిముఖతఁ గుందెడిశిష్యుల,నమలినబుద్ధులను జూచు టర్హము కాదే.

శుక్రుండు దైత్యులకడకు వచ్చుట

వ॥ అని జయంతిం గాంచి తరుణీ! యేను సమయంబొనర్చిన
వత్సరమ్ములు పదియు సంపూర్తిఁ జెందెఁ గావున నేఁడు శిష్యులం గనఁ
బోయి కొండొకకాలమ్మునకు మరల నిన్నుం గన వచ్చెద నస్మత్పుత్రులు
దేవతలయంద సంక్రమింపం గలరు నావుడు జయంతి వల్లె యనిన నతం
డు తనయాజ్యులకడ కరుదెంచువాఁడు మునుదట, ౨౧౦

మ॥ కనియెన్ దైత్యులయొద్ద వేదమతమున్ ఖండించుచున్ జైనవ
ర్తనమే శ్రేయ మటంచు చహింప మిగులన్ ధర్మం బటంచుం "బలా
శనసక్తుల్ పశుహింస తర్క మనుచున్ శాసించి రంచున్ గ్రమం
బున బోధించుగురున్ స్వకాకృతిధరున్ బొంగారుకోపమ్మునన్.

చ॥ గురుఁడఁట! సర్వశాస్త్రములకుం దెర వౌ నఁట! పాపబీజలో
భరతి నసత్యవాక్యములు పల్కి సురారుల మోసపుచ్చు సు
స్థిరమతి నున్నవాఁడఁట! యిసీ! కడుఁబాపపులోభ మెంతయు
న్నరకపుఁద్రోవ దాని గనిన న్నరుఁ డెప్పనిఁ జేయకుండునే. ౨౧౨

క॥ అని దైత్యులఁ గని యెలనగ, వున నిట్లను "నాదురూపు వొరసినక
పటూ, త్ముని గురునిఁ దెలియ నేరక, యనఘులు వంచింపఁ బడితి
రకటా! మీరల్. ౨౧౩

గీ॥ ఏను నిక్కపుశుక్రుఁడ నితఁడు దాంభి, కుఁడు మహాకృతిఁ బొరసిన
గురుఁడు నమ్ముఁ, డితనిపలుకుల నాస్థ మీ రెనయఁ బోకుఁ, డనిన
దైత్యులు సంభ్రాంతు లైరి పిదప. ౨౭౪

వ॥ బృహస్పతియు సంశయడోలాయమానమానసుల రక్కసులఁ
గాంచి విశ్వాసార్హంబుగ నిట్లను. ౨౭౫

ఉ॥ దానవులార! నమ్మకుఁ డతం డమరప్రియ మాచరింపఁగా
లోనఁ దలంచి మిమ్ములను లోభమునన్ గికురింప వచ్చినాఁ
డేను భవన్నిమిత్తమున నీశునిఁ గొల్చితి విద్యఁ గొంటి ని
ద్దానికతమ్మునన్ సురలదర్ప మడంతురు మీఁగ లొప్పుగన్. ౨౭౬

క॥ అనుకపటశుక్రవచనం, బున మోహితు లగుచు దనుజపుంగవులాశు
క్రుని నమ్మ రైరి కపటం,బునఁ బడువారలు యథార్థమును గనఁగల రే

క॥ పదివత్సరములనుండియుఁ,బదిలముగా విద్యఁ గఱపుపరమగురునిబల్
సదయునిఁ గా దన నేర్తుమె!,మదిలో నెఱిఁగితిమి నీదుమాయల నెల్లన్

వ॥ పొమ్ము పొమ్మని యనాదరించిన శుక్రుండు కోపించి మీ
ప్రియంబు గోరినయథార్థవక్త నగు న న్నవమానించితిరి గావునఁ బ్రణ
ష్టసంజ్ఞులై పరాభవమ్ము నొందుదురుగాక యని శపించి వెండియు,

క॥ నను నవమానించినఫల,మును వైళమ పొందఁగలరు మునుకొని యీ
తం, డొనరించినకపటం బది, యును నప్పుడ తెలియు నంచు నొగి
నతఁ డరిగెన్. ౨౮౦

గీ॥ దైత్యులకు శుక్రశాపంబు దవులు టెఱిఁగి; శక్రుకడ కేగి యబ్బృ
హస్పతి రయమున, శాపహతు లగుదైత్యుల సంహరింపఁ, దివురు
మన సంతసించె నద్దితిజవైరి. ౨౮౧

వ॥ దేవతలును యుద్ధసన్నద్ధు లైరి. అంతట రక్కసులు చింతా
క్రాంతులై యిట్లు వితర్కించిరి. ౨౮౨

చ॥ తెలియక భ్రాతృభార్యరతిఁ దేలినపాతకుమాయఁ జిక్కి ని
ష్కలుషు గురుం ద్యజించి యిటు శాపహతిం గనినట్టిబుద్ధిహీ
నుల మనలన్ జయింపఁగ మనోగతి నెంచి సురల్ రణేచ్ఛ పెం
పలరఁగ నున్నవార లకటా! మన కిప్డు సహాయు లెవ్వరో. ౨౮౩

గీ॥ మనల వంచించి చనియె నమ్మాయగురుఁడు, దైత్యగురునకు నెప్పాట
దయు మెసంగు, ననుచుఁ బ్రహ్లాదుఁ గలిసి చయ్యన గురువరు, కడ
కరిగి పాదములకు మ్రొక్కఁగ నతండు. ౨౮౮

మ॥ కడుఁ గోపమ్మునఁ గాంచి పల్కు ««హితముం గావింపఁగా నున్న నా
యెడ విశ్వాసము లేక పల్లదము లెన్నే నాడి యిచ్చోటి కి
ప్పుడు రాఁ గారణ మేమి! సత్వరగతిన్ బో రాదె యవ్వంచకుం
డొడయండై యుపకారమున్ సలుప లేఁడో! మీకు నిప్పట్టునన్.

వ॥ నావుడుఁ బ్రహ్లాదుం డనునయవచనమ్ములనిట్లను. మహాత్మా!
యస్మద్ధితమ్మున కీవు తపం బొనరింపఁ జనినమీఁద నమ్మాయికుఁడు భవ
ద్వేషంబు దాల్చి మమ్ము మోసపుచ్చె నజ్ఞానదోషమ్మున నేము కల
తెఱం గెఱుంగక నిన్నాడినపల్లదమ్ములు సైరించి మమ్మనుగ్రహింపుము.

చ॥ తెలియక చేయుతప్పులను ధీవరు లొప్పి సహింతురీ మానివ
ర్యులు క్షణకోప; లగ్గలపుఁగ్రోధమునన్ శరణార్థులన్ విడం
దలఁచుట న్యాయ మయ్యె! నుమతిన్ మముఁ గైకొనకుంటివే రసా
తలమున కేగువార మిది తథ్యము నావుడు శుక్రుఁ డి ట్లనున్.

క॥ కనుఁగొంటి జ్ఞానదృష్టిం, గొని మీయాథార్థ్యమెల్లఁ గూర్మి మె
యిన్ మిమ్మునురక్షింతు రసాతలమునకుంజన నేల మానమునువిడ నేలా

వ॥ బ్రహ్మవలన మున్ను నావినినరహస్యం బొకండు గల దవ
శ్యము గాఁ దగుశుభాశుభమ్ముల నొక్కని కడ్డ నశక్యంబు. దైవంబుకతన
బలహీను లగుమీర లిప్పుడు దేవతల కోహటించి పాతాళమ్మున కరు
గునది. ఇంతదనుక దైవసాహాయ్యమ్మునం జేసి మీరు త్రిలోకరాజ్య
మనుభవించుచుండఁ బదియుగమ్ములనుండి రాజ్యపదభ్రష్టు లగుదివిజు
లకు నేఁటికి భోగకాలం బయనించె. సావర్ణికమన్వంతరమ్మున భవత్పౌ
త్రుం డగుబలి త్రిలోకవిజయం బొనరింపఁగలఁడు. మున్ను హరి వా
మనరూపమ్మున నీమనుమని రాజ్యమ్ము హరించు నప్పుడు ««సావర్ణికమనువు
కాలమ్మున నీకు నింద్రత్వంబు గలుగు" నని వచించె నది మొదలు బలి
గూఢరూపమ్మునఁ బ్రివర్తించువాఁ డొక్కయెడ గార్దభరూపమ్మున నొక
శూన్యాగారమ్మున నింద్రునకుం గన్పట్టిన నతం డతని నెఱింగి యిట్లను.

క॥ దానవులకెల్ల భర్తవు, ధీనిధివి జగమ్ములకు నధీశుఁడ వగుచీ, కానే!
గార్దభరూపం, బూనుట; యి ట్లేల భీతి నొందిగెను చెపుమా.

వ॥ నావుడు బలి యిట్లను.

చ॥ జలచరరూపముం గొనఁడె సారసనేత్రుఁడు! బ్రహ్మహత్యమై
బల మఱి నీవు గూఢముగఁ బంకజమందు నడంగవో! తగన్
దలఁపుము కాలశాసనము దాఁటఁగ నెవ్వఁడు శక్తుఁ! డేమనన్
దలఁకి ఖరాకృతిం బొరసి దైవగతిన్ జరియింతు నీగతిన్.

వ॥ ఇట్లు వార లన్యోన్యమ్మును సంభాషించుకొని దైవమ్ముకతన
సర్వమ్ము ప్రవర్తించుట యెఱింగి తమతమపొందుపట్లకుం జనిరి. ౨౯౩

క॥ కావునఁ గష్టసుఖమ్ములు, దైవాధీనము లటఁచు దైత్యగురుఁడు వి
ద్యావిదునకుఁ బ్రహ్లాదున కీ, విధి నెఱిగింప నాతఁ డెఱిఁగి తనంతన్.

వ॥ దైత్యులం గాంచి యి ట్లను నిప్పుడు కాలానుకూల్యంబు
లేమి మనకు సంగరంబున జయంబు దుర్లభ మ్మగుట మిన్నకుండుట
శ్రేయంబు నావుడు మదగర్వితు లగురక్కసు లి ట్లనిరి. ౨౯౪

చ॥ దైవ మనంగ నెట్టి దగు! దానిని జూచినవాఁ డెవండు! కా
ర్యావసరంబుపట్ల నలసాత్ములు వల్లె శిరీతి గాక మా
కీ వోడయుండ వై నిలిచితేని క్షణమ్మున దున్నకుందుమే
దేవతలన్; గడంగు మిఁకఁ దెంపరివై యరులన్ హరింపఁగన్.

వ॥ అనినఁ బ్రహ్లాదుండు సేనాధిపత్యంబుఁ బూని యనికి సుర
లం బిలిచిన నింద్రపురోగములై వారును బోరితంబునకుఁ గట్టాయి
తం బైరి. ౨౯౬

క॥ సురపతికిని బ్రహ్లాదున, కు రణం బఱిమిఱి నెసంగె ఘోరమ్ముగ వ
త్సరములునూఱుగతించెను,బరమాశ్చర్యంబుఁగొడమెఁ బైవారలకున్

వ॥ పిదప నెట్టకేలకు దైత్యులు జయం బంద నింద్రుండు వాచ
స్పతియానతిం గొని జగదంబిక నిట్లు నుతింపఁ దొడఁగె. ౨౯౭

సీ॥ శూలధారిణి! నిత్యసుఖదాత్రి! శంఖచక్రగదాదికాయుధరాజమాన
హస్త! మహామాయ! యఖిలజగద్ధాత్రి! దశతత్త్వరూపిణి! తల్లి
పంచ, కోశసంస్థాయిని! కుండలినీరూప! దీపశిఖాత్మిక! దేవి! దివ్య,

శక్తి! బింద్వాత్మ! పుచ్ఛబ్రహ్మరూపిణి! యానందకలిక! వేదాంత వేద్య!; గీ॥ దానవులతోడఁ బోరాడి దర్ప మెడలి, దీనదశఁ జెంది యున్నమా దిక్కొకింత, సహజశీతలదృష్టిప్రసార మొసఁగఁ, జేసి రక్షించి ధన్యులఁ జేయఁ దగదె. ౨౯౯

## సురలు దేవిని స్తుతించుట

గీ॥ సహజసుఖవంతులకుఁ గడు సౌఖ్య మబ్బు, దుఃఖితుల కెల్ల దుఃఖముల్ తొలఁగి పోవు, ముక్తి గోరినవారికి ముక్తి గల్గుఁ, దల్లి! నిన్ను మన మ్మునఁ దలఁచి రేని. ౩౦౦

గీ॥ సృష్టిరక్షాప్రళయములు సేయునీదు, చరిత మెఱుఁగరు బ్రహ్మాది సకలసురలు, పాపసంసారతారకి పటిమ నలరు, త్వత్పదమ్ములు గొలుతురు ధన్యమతులు. ౩౦౧

క॥ శరదిందుముఖులు చామర,విరుప్రక్కల వీవ శిబిక లెక్కి మహా సం దరసాబ్ధి నోలలాడెడి, నరులెల్లఁ బురాభవమ్మున న్నీభక్తుల్. ౩౦౨

క॥ కరులు గలవారు విలస, త్తరుణీసంభోగనియతతారుణ్యమదో ద్ధురత గలవారు నరవర, పరిచితచరణులును నీదుభక్తులు తల్లీ

చ॥ అని నుతియింపునిఁద్రునకు నంబ చతుర్భుజయై మృగేంద్రవా హన యయి రక్తవస్త్రధరయై విలసత్సుమమాల్యభూషణా భినవశరీరయై కరుణపెంపున నింపెసలారుచారులో చనములదీప్తు లొప్పఁగ వెసన్ బొడసూపె మనంబు పొంగఁగన్.

వ॥ ఇట్లు పొడకట్టి సురల కభయం బొసంగి యసురు లున్నకడ కరుగుటయు భయత్రస్తులై వార లన్యోన్యముఖంబులు గనుఁగొనుచు,

గీ॥ వక్రదృష్టిని మధుకైటభవధ చేసి, చండముండాదులను జంపి చండ కోప, మడరమహిషాసుర వధించినట్టిశక్తి, మనల హరియింపవచ్చె నేమనఁగ వచ్చు. ౩౦ౕ

వ॥ పిమ్మటఁ బ్రహ్లాదుండు సిగ్గువిడియక సంగరం బొనర్పుఁ డని మొనకొల్పిన నాతనివచనంబులు వినక భయమ్మునఁ బరుగిడురక్కసుల నిలువరించి నముచి యిట్లనియె. ౩౦౬

క॥ ఎదిరించిన నంబిక మన, మదమడఁచుట నిక్క మాపె మన్ననమై మ్రొ
క్కుదము తదనుగ్రహమ్మునఁ, గదలిరసాతలమునకుఁ దగఁ జనుద
మొగిన్. ౩౦౮

వ॥ ప్రహ్లాదుండును నముచివచనంబు లియ్యకొని యంబిక
నిట్లు సన్నుతించె. ౩౦౯

శా॥ మాలాసర్పముభంగి సర్వజగ మంబా! యొప్పు నీయంద నీ
హేలల్ సర్వము నిర్వహించు విధివిష్ణ్వీశాను లన్నన్ భవ
లీలాకల్పితహేతుమాత్రు లరయన్ లేశంబు సత్యంబు లే
దేలా పల్కులు వేయు! మ్రొక్కు లిడుదున్ హ్రీంమూర్తికి న్నీ కొగిన్.

ఉ॥ అందఱ కీవ తల్లివి కదా! జగదంబ! సురారులందు నీ
కుం దయ దప్పుటేమి! కొడుకుల్ పదిమంది గలట్టితల్లికిన్
గొందఱు దుండగుల్ మఱియుఁ గొందఱు సాధులుగాపు ట
బ్రమే! నందనులందుఁ బక్షములు న్యాయమె బిడ్డలఁ గన్నయమ్మకున్.

గీ॥ ఉభయులము స్వార్థపరులమ యుభయులమును, గశ్యపోద్భవులమ
ధనకనకవస్తు, వాహనమ్ములకొఱకు నుభయుల మని నొ, సర్వ
నొక్కడఁ బక్షమూనంగఁ దగునె. ౩౧౨

గీ॥ అన్నదమ్ముల మైనమే మనికిఁ జొరఁగ, నేమి కారణ మిరువుర కిట్టి
భేద, మెవరు కల్పించి రీవు కా కేము సురలు, కలహ మొనరింప
నీ కిచ్చ కలుగఁ బోలు. ౩౧౩

వ॥ కాదేని యన్నదమ్ముల కెన్నండేని వైరంబు గల్గునే! సర్వ
కారణంబ వగునీకెఱుఁగఁ బోలనిదొం దుండునే! ఇంద్రుండు భర్తా
త్తుం డగుటకు మాకును సమ్మతంబ యైనను భాగార్ధంబు మా కీకల
హంబు దప్పదు దీని వారింప నీకుఁ దక్క నొరులు వలంతురుగారు.

ఉ॥ అంబురుహాక్షు నిల్పితికదా! జగ మేలు మటంచు; నాతఁ డే
కంబుగ రెండుపక్షములు కన్గొనఁ డేమన వచ్చు నాసము
ద్రంబును ద్రచ్చునప్పుడు సుధన్ మణి వారల కిచ్చి తాను ల
చ్చిం బడసెన్ వృథా యొగును చేసి మమున్ గలహంబు దప్పునే.

వ॥ మఱియు నైరావతంబు నుచ్చైశ్శ్రవంబును గామధేనువును నతనియనుమతింజేసి యింద్రునిపాలియ్యఁ బక్షపాతి యగుకతన ననయు లగుసురల రాజ్యమ్మున నిల్పి మమ్ముం బరాజితులఁ జేయుచున్నవాఁడు.

క॥ ధర్మం బిదియేకద దు, ష్కర్ములకుఁ జయ మొసంగఁగాఁ దగునే?
యీ, మర్మమ్ము నీ వెఱుంగవె, దుర్మతు లమరులొ దితిజులొ దుఃఖ
నిహంత్రీ. ౩౦౮

వ॥ వేదశాస్త్రమ్ముల కైనను నేకవాక్యత గన్పట్టదు స్వార్థపరు లగుటంజేసి తత్పరిశీలకులకును సామానాధికరణ్యంబు గానరాదు సంసారమందొక్కరుండును గాంతాకనకవిరక్తుండు లేఁడు కావున ధర్మాధర్మంబులు నీకుం దక్క నన్యులు నిర్ణయింప నసమర్థు లది యట్లుండె.

గీ॥ శశి బలాత్కారముగ గురుసతి హరించె, ధర్మమెఱిఁగియు గౌతమ
తరుణిఁగలసె, నింద్రుఁడు; గురుం డనుజభార్య నెనసె, గర్భవతి;
నరసి చూడ నిది ధర్మవర్తనంబె. ౩౦౯

గీ॥ ఇంచుకేనియు నపరాధ మెఱుఁగఁడట్టి, రాహుకంఠంబు దెగఁగొట్టె
రాక్షసారి, సత్త్వగుణ మున్నవాఁడఁట జననిǃయాతఁ, డకటǃమత్పౌ
త్రురాజ్యఁబు నపహరించె. ౩౧౦

క॥ దేవతలు చేయుదుష్కృతు, లేవారు గణింప నేర్తు రింతింతలెǃయీ
దేవతలు ధర్మవర్తులె?, కోవిదు లిప్పాటఁ జెప్పుకొనఁ జెల్లునొకో.

క॥ సురలు సధర్ము లధర్ములు, సురారు లని చెప్పునట్టి చోద్యపుఁగతలన్
బరిశీలించినఁ బుక్కిటి, పురాణములు గాని నిక్కములు గావుసుమీ.

గీ॥ నీ కెఱుఁగరానిగోప్య మెందేనిఁగలదె, తెలుప వలసి వచించితి దేవ
దేవి, శరణుఁ జెందినమమ్ము రక్షణ మొనర్ప, నెంచెదో చంప నెంచె
దో యే నెఱుంగ. ౩౧౩

వ॥ నావుడు జగదంబ రక్కసుల కిట్లను మీరలు గతక్రోధులై నిర్భయమ్ముగ రసాతలమ్మున కరిగి యట ననుకూలకాలనిరీక్షణపరాయణులై యుండునది. ౩౧౪

గీ॥ ఎంతరాజ్యము కల్గిననేమిసుఖము, కలుగనేరదు లోభసంక్రాంతమ తుల,కది యొకటి లేనివారల కన్నియెడలఁ, గలుగు సౌఖ్యంబు నా యాజ్ఞ గైకొనుండు. ౩౨౭

క॥ నావుకుదానవులాయమ, భావమ్ము నెఱింగి సతులు పచరించి చనఁ దేవియు నదృశ్య యయ్యెఁ, దేవతలును జనిరి కథ యిది శుభమ్ము లిడుఁ. ౩౨౮

విష్ణుని యవతారములు.

వ॥ నావుడు జనమేజయుం డిట్లనియె.

గీ॥ భృగువుశాపంబుకతన నవ్విష్ణువునకు, నెన్ని యవతారములు గల్గె నిద్ధచరిత!, యేమనువుకాలమున నతఁ డిలజనించె, నెఱుఁగఁ జెప్పు మనవుడు మునీంద్రుఁ డనియె. ౩౨౨

క॥ నరనారాయణు లన నవ, తరించె శ్రీవిష్ణువెలమి ధర్ముండనుభూ సురునకుఁ జాక్షుషమన్వం, తరమున; నిదిచెప్పినదియె ధరణీనాథా!

వ॥ తృతీయయుగమ్మున వైవస్వతమన్వంతరమ్మున నత్రిభార్య యగు ననసూయకు బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ముప్పురును బుత్రులై జనించి రందు బ్రహ్మ సోముండు;హరి దత్తాత్రేయుండు హరుండు దుర్వా సుం; డని యెఱుంగునది. ౩౨౯

గీ॥ నాలవయుగమ్మున జనించె నారసింహుఁ, డగుచు హరి దేవహితకా రియై హిరణ్య, కశిపు వధియింపఁ ద్రేతాయుగమ్మునందు, వామనుం డయి జనియించె బలి నడంప. ౩౩౦

వ॥ అట్లు కపటవామనుండై కశ్యపున కుద్భవించి బలిని బాతా ళమ్మున కనిపి పందొమ్మిదవ త్రేతాయుగమ్మున మరల జమదగ్నికి సుతుం డయ్యె. ౩౩౧

ఆ॥ వె॥ అతనిఁ బరశురాముఁ డందు రాతఁడ కాడె, క్షత్రికులమునెల్ల సంహరించి, పుడమియెల్లఁ గశ్యపునకు దానం బిచ్చె, నఘహ రంబు నిక్క మతనిచరిత. ౩౩౨

వ॥ త్రేతాయుగమ్మునన రఘువంశప్రదీపకుం డగుదశరథునకు రాముఁడై జనియించె. ౩౩౩

క॥ అష్టావింశయుగమ్మున, దుష్టుల హరియించి పుడమి దుడుకడఁపంగా
శిష్టులు నరనారాయణు,లిష్టులు కృష్ణార్జును లయి యొసఁగిరి జగతిన్.

వ॥ వారు కురుక్షేత్రమ్మునఁ గౌరవులతోడ ఘోరయుద్ధంబొనర్చి జయంబుగొనిరిట్లు తత్తద్యుగమ్ములఁ బ్రకృతివశమ్మున ననేకావతారమ్ములు హరికిఁగలుగుచుండు జగమ్మఖిలంబును బ్రకృతివశం బని యెఱుంగుము. సర్వాదియు సర్వగుఁడును నవ్యయుండును నగుపురుషుం డీయఖిలమ్మును సృష్టించి యేయుపాధికతనఁ ద్రివిధుండై యొప్పు నాప్రకృతి యుత్పత్తి కాలయోగమ్మున భిన్నమై ప్రకాశించుచుండు నయ్యాదియు సృష్టిస్థితిల యమ్ము లొనరించునది యెట్లం టేని. 33౫

ఆ॥ వె॥ ప్రకృతియకర్తలగుచు బ్రహ్మయు విష్ణువు శివుడుఁ జేయుచుండ్రు
సృష్టిరక్ష, ణలయకృతులనెల్ల నరులకుఁ బ్రకృతి యొ, సంగుఁ
గష్టములను సౌఖ్యములను. 33౬

వ॥ ఆప్రకృతియకదా మున్ను కాకుత్స్థుం డను నొకరాజన్యు సృష్టించి రాక్షసవినాశమ్మున కొక్కెడ నుంచె. 33౭

క॥ ఒకఁడనఁగనేల యెల్లరుఁ,బ్రకృతికి వశు లగుచు భవముపాలై సౌఖ్యా
దిక మనుభవించుచుందురు,వికలము గాకుండునట్టి విధితంత్రమునన్.

వ॥ నావుడు జనమేజయుం డిట్లను మహాత్మా! నరనారాయణా శ్రమమ్మున కేతెంచి యచ్చరలు నారాయణుం బతిగా వరించి రని నుడివితి వాతండు పిదప నేమి యొనర్చె నక్కత విన వలతు ననిన సాత్య వతేయుం డిట్లనియె. 33౯

ఆ॥ వె॥ శాప మీఁగ నెంచి చయ్యన నరుఁడు వా, రింప నుడిగి యాని
లింపవార, సతులఁ గాంచి స్మిత మెసంగ నారాయణుం, డాన
తిచ్చె మధుర మైనఫణితి. 3౪౦

క॥ కృశసంకల్పుఁడనగునా, కతివలతోఁ బొందుఁ జెందుటర్హమె మీరల్
ప్రతి సెప్పక త్రిదివమ్మున, కతిరయమున నిప్పు డరుగుఁ డంగనలారా!

వ॥ మనోహరం బగునీశృంగారమునకు స్థాయిభావమ్ము రతి నాఁ బరఁగు నయ్యది లేకున్న నే నెటు మి మ్మవలంబింతు మీపాటిబోటులకు విరణీయుండ నగుటం జేసి నాభాగ్యస్వరూపమ్ము లనన్యసామాన్యంబులు

నాయందు దయ గలిగి వ్రతభంగంబు గాకుండ నిప్పటికిఁ జనుండు మీ కోరినయట్ల యష్టావింశం బగుద్వాపరయుగమ్మునఁ బ్రవర్తించువాఁడ.

క॥ సురవాక్యం బానరింపఁగ, నరుఁడెంతు ధరాతలమున కమ్మెడ మీరల్
నరపతితనూజలై నర్, వరియింతురు భార్యలగుచుఁ బరిపరిగతులన్

వ॥ అని యొప్పం జెప్పిన నయ్యచ్చరలు దివమ్మున కరిగి కలతె అం గెలింగించి శక్రునకు సఖీసమేత యగునూర్వశిం జూపిన సతండును దల్లావణ్యమ్మున కచ్చెరు వంది మునులధైర్యమ్మునకు మెచ్చి వేనోళ్ల సన్నుతించె నరనారాయణులు నెప్పటియట్ల తపోనిష్ఠాగరిష్ఠులై యుండి రియ్యది వారిచరితం బని మఱియును. ३४४

క॥ వా రిరువురుఁ గృష్ణార్జునులై రమణ జనించి పుడమి కానందముచే
కూరఁగఁ జేసిరి భృగుశాపారంభము కారణముగ నవనీనాథా.

వ॥ నావుఁడు జనమేజయుండు మునీంద్రా! కృష్ణావతార చరిత్రం బు విస్తరించి వచింపుము హరియును నరుండును నెవరికిఁ బుత్రు లట్టి దేవకీవసుదేవులఁ గంసుం డెట్లు బంధనాగారమ్మున నుంచె! మధుర యం దుదయించినహరి గోకులమ్మునకు రానేల! కంసవధానంతరమ్మునఁ గృష్ణుండు ద్వారక యందు వసియించుటకుఁ గతం బెయ్యది! ३४६

క॥ తనపిత్రార్జితదేశ, మ్మున నుండక యన్యదేశమున కేగుట యె
వ్వనికి ననర్హంబన న, య్యనిమిషవంద్యునకు నెట్లు లది తగఁ జెప్పుమా

వ॥ అదియునుంగాక ద్విజశాపమున యాదవకులంబు నాశనం బయ్యె, గృష్ణనిర్యాణానంతరంబున నతనిభార్యలం దోచినదొంగలఁ బార్థుండు సంహరింపకుంటయు నక్కజంబయి కన్పట్టెడి. ३४७

క॥ గాంగేయుండును ద్రోణుం,డంగపతియు మొదలు వీరు లతిభారదులై
క్రుంగఁగ జేసిరె!పుడమిని, దొంగలభారం బాకింత దోఁపదె చెప్పుమా!

వ॥ మహాపతివ్రత లగుశ్రీకృష్ణునిభార్యల కిట్టిభంగపాటును వసుదేవుండు పుత్రదుఃఖమ్మున మృతుండగుటయుఁ గృష్ణాశ్రితు లగుపాండవులకుఁ గష్టమ్ములుదొడరుటయు మహాభాగ యగుద్రౌపది పడిన బన్నంబు లట్లుండఁ దత్పుత్రు లశ్వత్థామచే నన్యాయముగ హతు లగుటయు సౌభద్రుం డగునభిమన్యుండు బాల్యమ్మునన యధర్మయుద్ధ

మునఁ దెగుటయు దేవకీతనయు లార్గురునుం గంసునిచేఁ జంపఁ బడు
టయు నాకు మిక్కిలి వ్యసనం బొనంగెడి నిది యిట్లుండ. ౩౧౦

గీ॥ యాదవులు ప్రభాసమ్మున హతు లగుటయు, వారిపత్నులు దొంగల
బారిఁబడుట, యట్టులుండఁగ నాదినారాయణుండు, కృష్ణుఁ డుగ్ర
సేనుని సేవ కెట్టు లొప్పె. ౩౧౧

గీ॥ హర్షశోకాదికములు లోకాధ్యుఁ డైన, హరియు సామాన్యులంబోలెఁ
బొరయు నెట్లు?, చోరుభాతిని రుక్మిణీసుదతిఁ గొని ప, లాయనం
బొనరింప నేలా యతనికి. ౩౧౨

వ॥ మధురాపురమ్మునుండి హరి ద్వారక కేగుతఱి వ్రజగోప
సం బొనర్చుచు నజ్ఞేయుం డగుట యెట్లు వివరింపు మని వెండియు. ౩౧౩

ఉ॥ పాయక సందియమ్ము లతిపారముగాఁ గనుపట్టుచుండు న
త్యాయతబుద్ధిఁ దీర్పఁ దగునట్టిమహాత్ముఁడ వీవు కోరఁగా
నాయెద గొంకెదున్ ద్రుపదనాథతనూజ నొకర్తు నేవురున్
జాయగ నెట్టు లొప్పిరి రసజ్ఞులు పాండవు లెగ్గెఱుంగరే. ౩౧౪

గీ॥ ధర్మమతులు సమర్థు లుద్ధతులు పాండవులు మహాత్ములు వా రెట్లు
కలికి నొక్కరితెఁ బత్నిగా నగుచు వరింప నెంచి, రియ్యదియు
ధర్మమేని నా కెఱుఁగఁ జెప్పుము. ౩౧౫

గీ॥ దేవసముఁ డైనగాంగేయుఁ డేవిధమున, గోళకులచేతఁ గులవృద్ధి
గొనుట యొప్పె, నకట! "యెల్లని సంతాన మర్హా" మనుచుఁ, జెప్పు
ధర్మమ్ము లెంతకుత్సితము లనఘ. ౩౧౬

వ॥ నావుడు వ్యాసుండిట్లనియె.

క॥ దేవకి కొమరుని చరితము, పావనము సమస్తలోక పాపాపహమున్
దేవశ్రావ్యము మిగుల శుభావహ మద్దానిఁ బ్రీతి నాలింపు నృపా.

## కృష్ణావతారకారణము.

క॥ ఒకనాఁడు పుడమిభారం, బుకతన స్వర్లోక మేగి పురపుర పొక్కన్
సకరుణుఁడై యింద్రుండు ధరకు గోరూపధర కాదరమ్మునఁ బలికెన్.

గీ॥ నెట్టపంటగ శోకింప నీకు నేమి,వచ్చె? నావుడుఁ బుడమి యవ్వా
సవునకుఁ, గల తెఱంగెఱిఁగించె నిక్కరణి దీన,వదనయై యశ్రు
లచాలు వఱద గాఁగ. ౩౫౯

వ॥ సురేంద్రా! దుఃఖకారణం బడుగు నీకు నే నే మని చెప్ప
దు జరాసంధుండును శిశుపాలుండును గంసుడును రుక్మియును నరకుం
డును సాల్వుండును గేశియు ధేనుకవత్సకులు మొదలగు దుర్మార్గులు కేవ
లాధర్మవర్తనులై పరస్పర ద్వేషమ్ము పూని చరించువారు వీరలభార
మ్ము నే సైరింప నోప నని వెండియు. ౩౬౦

చ॥ హరి కిటిరూపధారి యయి యక్కనకాక్షు వధించి నన్ సము
ద్ధరణ మొనర్చి నిల్పినవిధం బది నీవు నెఱుంగుదే కదా
మరల నిదొక్కబాధ సురమండలనాయక! భూరిదుఃఖమే
దురిత తరంగరింగణపుముందు మునుంగను నెన్ని భంగులన్. ౩౬౧

వ॥ హరి మున్నట్లొనర్పనినాఁడు పాతాళమ్మునకుం జని యీ బా
ధల కవిషయమనై సుఖముండుఁ గదా యని చింతించి మఱియును.

క॥ అష్టావింశయుగం బతి, దుష్టప్రచురమయి కడకఁ దోఁచుఁ గటా!
శిష్టవిగర్హితు లగునా,కష్టాత్ములు నాకు భారకారులు కారే. ౩౬౩

ఆ॥ వె॥ భరము మోయఁ జాలఁ బాతాళకమున కిప్డు పోవు దానఁ బే
ర్మి పొలుపు మీఱ, నాసతిమ్ము భార మైన హరింపుము, తాళఁ
జాల నీకు దండ మిదుడు. ౩౬౪

వ॥ నావుడు నిందుఁడు నీభారమ్ము హరింప నే నెంతవాఁడ
బ్రహ్మలోకమ్మున కరిగెదెసిఁ జతురాననుం డిమ్మ్యెడ నుపాయంబు
గల్పించు. ౩౬౫

క॥ నీవెంట నేను వచ్చెద, దేవి! యచ్చోట కిపుడ తరలి చనుట మే
ప్పేవిధి నైనను నావిధి, నీవంతవంత నెడఁ బాపు నిక్కం బనినన్.

వ॥ పుడమియు నియ్యకొన నిందుఁడు దాపు వెనువెంట నరిగె
నంత దుఃఖాక్రాంత యగుధరణిం గాంచి చతురాననుం డిట్లనియె
నీ వేకతమ్మున నిట్లు దుఃఖింతు విన్నవ్వాఁడు వీడించె నావుడుఁ బుడమి
యి ట్లనియె. ౩౬౭

ఉ॥ చెప్పెడి దేమి నాకుఁ గలచేఁటు పితామహా! భార మాఁగఁగా
దెప్పర మాయె; నిఁకఁ జనుదెంచుఁగదా కలి; దాన భూపతుల్
తపసులు నెల్లధర్మము లుదారగుణమ్మును మాని శౌర్యముల్
చొప్పడ సంచరింతు రిది చూడఁగ భారము గాక యుండునే. ౩౧౮

క॥ ఈకలుషాత్ముల నెల్లర, నాకైనధియింపు మయ్య నానాసైన్యా
నీకముల నోపఁ జాల వ,రాకిని నే నెంత పోర్చిన రాదె మహాత్మా.

వ॥ నావుడు విరించి యోదేవీ! నే నీకృతి కసమర్థుండ జగన్నాథుం డగు శ్రీహరికడ కరుగఁ దగు నని యంచ నెక్కి సురపరివృతుండై ధరణీసహితమ్ముగ వైకుంఠమ్మున కరిగి సనాతనుం డగు నద్దేవు నిట్లని నుతించె. ౩౨౦

ఉ॥ వేయిశిరమ్ములుం మఱియు వేయికరమ్ములు వేయికన్నులం
త్యాయతరీతి నొప్పు పరమాత్ముఁడ! యావదజాండసంతత
ధ్యేయుఁడ! వేదపూరుషుఁడ! దివ్యము నీమహిమంబు నీవ కా
వే యమరత్వ మిచ్చితివి విశ్వవిధాయక మాకు సత్కృపన్. ౩౨౧

వ॥ ఇట్లు సన్నుతించు సనాతనియెడఁ గరుణించి గరుడధ్వజుండు ప్రసన్నుండై యంచజు వేల్పుఁ గుశలం బడిగి యాగమనకారణం బే మనవుడు విరించి యిట్లనియె. ౩౨౨

మ॥ ధర భారమ్ము సహింపఁ జాల నని వంతం బొందు మాకుం దురు
ద్ధర మీకార్యము ద్వాపరాంతమున దుష్టక్షితీశ భూభరో
ద్ధరణార్థం బవతార మెత్తుము నిరాతంకంబుగా భూస్థలిం
గరుణింపం దగదే యనాథులకు నీకన్నన్ బరుల్ గల్గిరే. ౩౨౩

వ॥ నావుడు నతం డిట్లను.

ఆ॥ వె॥ ఏను నీవు రుద్రుఁ డితరులు నమరులు, నస్వతంత్రులనుచు నరయు
మఖిల, జగము యోగమాయసంగతిగుణసూత్రి,కలిత మగుచు
నుండుఁ గంజసూతి. ౩౨౪

వ॥ ఆపె దానె ట్లొనర్ప నిచ్చగించు నట్లు చేయుదము మన మందఱమును తద్వశగతులము, అట్లుకానివాఁడు మున్ను నేను మత్స్యకచ్ఛపాదితుచ్ఛయోనులం జనింతునే యని వెండియు. ౩౨౫

క॥ ఆర్యములు గానినింద్యపుఁ, దిర్యగ్యోనుల జనింపఁ దివురుట సుఖతా
త్పర్యమొ పుణ్యమొ కీర్తియొ శౌర్యమొ భోగమొ మఱేమి సారస్యంబో. 328

వ॥ కిటినృసింహవామనరూపమ్ములు ధరించుటకును నయ్యాంబయనిమిత్తం బదియునుం గాక. 329

క॥ ఘనుఁ డగుజమదగ్నిమహా, మునికిఁ బరశురాముఁ డనఁగఁ బొడమి నృపతులన్, దునిమి తటాకంబులు గా, నొనరించితి రక్త మిదియు నొకసుకృతంబే. 330

వ॥ మీఁద రాముఁడనై జటావల్కలంబులు ధరియించి దండకారణ్యమ్మునం దిరుగుచు నన్నపానాదులు లేమిఁ గృశించి రాజచిహ్నంబులు విడిచి సిగ్గతి పాదచారినై గ్రుమ్మరుచు మాయాపిహితుండనైన కతనఁ గాంచనమృగంబుకల తెఱం గెఱుంగక యొక్కయారమ్మున నప్పాడమిచూలిం ద్యజించి యరుగుదు నంత లక్ష్మణుండును గొండొకసేపునకు వెన్నడి వచ్చె. 331

ఉ॥ పిమ్మట భిక్షురూపమునఁ బేశలగాత్రిని సీత నెత్తికొం
చమ్మొయి రావణుం డరిగె నంత లతాంగిని గాన కేను శో
కమ్ము గడల్కొనంగ నలకాననమెల్లను జూచి యేతద
ర్థమ్మున మైత్రిఁ జేసితిఁగదా! రవిపుత్రునితోడ నారయన్. 332

శా॥ వాలిం జంపితి ధర్మబాహ్యముగ నాపై వానరానీకము
ద్వేలంబై వెనువెంట రా దనుజులన్ దీండ్రింపఁగా లంకకా
భీలపరిక్రియ నేగి యచ్చట నగంభీరుండనై నాగపా
శాళిం జిక్కితి సానుజుండ నయి; యన్యాధీనతల్ కూడునే. 333

గీ॥ పాశములఁ జిక్కి చింతపాల్పడినయన్న, దమ్ములను మమ్ము విడిపించెఁ దతబలుండు, గరుడుఁ; డప్పుడు నామదిఁ గలుగుచింత, యింత యని చెప్ప శక్యమె యేరికేని. 334

సీ॥ రాజ్యమ్ము పోయె నరణ్యంబు గతి యాయె భార్యయు రక్కసుపాలఁ బడియె, నతికష్ట మగురణస్థితి పాసంగె నిఁకేమి సేయువాఁడ

వనమ్ము చెంత కనుచు, నప్పుడు తండ్రి గవ్వానను నాకీఁడు ధనహీ నుఁడఁ బదాతి ననద నకట; యెంతటిధనికున కేనియు వనవాస మతిభరం బగుఁ జెప్ప నలవి యగునె; గీ॥ మాదృశున కంచు క్షత్ర ధర్మంబు విడిచి, బోయవడువున నవ్వనంబునఁ జతుర్ద,శాబ్దములు వేఁగి మీఁద జయమ్ము గొంటి, దైవవశమున నాకు స్వాతంత్ర్య మేది. ౩౮౨

వ॥ మీఁద జానకిం గైకొని యయోధ్య కరిగి కొంతకాలమ్ము సంసారసుఖంబు లనుభవించుచుఁ బ్రజలఁ బాలించుచున్నంత. ౩౮౩

గీ॥ కడలుదాఁ్రిక్కినపడఁతిని విడువలేక, మరలఁ గైకొనె నితఁ డనుమాటకోప, లేక విడిచితి సీత సుశ్లోక నటవి, నకట! లోకాపవాద కేమ నఁగ వచ్చు. ౩౮౪

క॥ ఇమ్మట నత్తరుణీవిర, హమ్మున సంప్రాప్తమయ్యె నతిదుఃఖ మ్మక్కామ్మ రసాతలమునకరి,గె మ్మహిభేదించుకొని యొగిఁ దనయంతన్.

ఉ॥ ఏనును దమ్ములన్ బిదప నేగితి మొక్కమొగిన్ నిలింపసంస్థానము; నిట్టినాకుఁ బరతంత్రత గాక స్వతంత్రభావ మెం దేనియుఁ గల్గు టెట్లు! విను మీవును రుద్రుఁడు నిట్టివార లే జ్ఞానము లేమి మాయకు వశమ్ముగ నిమ్ముగ నుందు మెమ్మెయిన్.

వ॥ అని మఱియు నిట్లను.

ఉ॥ ఏమహనీయమాయ మన కేరికి గోచర గాక యుండు న ద్దాముని శాంతుఁ దత్త్వమయుఁ దారకు నప్పరపూరుషున్ గనన్ లే “మహ” మంచు గర్వమున నిక్కెదు మప్పరవస్తువాస్తవ స్థేమము నాఁడు చూచితిమి దెప్పర మాగతి నీ వెఱుంగవే. ౩౮౭

వ॥ అని సురల కిట్లనుఁ గల్పాదియందు సుధాసముద్రమ్మున మణిద్వీపమ్మున రాసమండలమ్మున మాచే నదృష్టపూర్వయు నశ్రుతచరయు నగుజగదంబ చూడం బడియె, సర్వకామప్రద యగు నా పెన్ భజించిన మీమనోరథమ్ము సిద్ధించు ననవుడు బ్రహ్మాదు లాయం బను మనమ్మున నిలిపి వేఁడికొనిన నాకె ప్రత్యక్షం బయ్యె. ౩౮౮

క॥ పాశాంకుశధారిణియు జ,పాశంకాకరణకాంతిపాటవకలనా
పేశలగాత్రియు నగుజగ,దీశానిం గాంచి యమరు లెనసినభక్తిన్.
వ॥ ఇట్లు నుతించిరి.

ఆ॥ వె॥ తలఁప న్నూర్ణనాభివలనఁ దంతువులు వి,భావసునివలన నపారగ
తి స్ఫు, లింగములునుబొడముఁలీలగా, నీజగ మెచటఁ బుట్టునాపె
కెఱఁగవలదె. ౩౯౧

దేవీస్తుతి

క॥ ఏమాయాశక్తికి లో,నై మను నఖిలప్రపంచ మాభువనేశా
నీమహిమనెన్నఁ దర మా,నే మానుల కైన మఱియు నెవ్వరికైనన్

వ॥ అని పెక్కుభంగుల నుతియించి తల్లీ! కంసాదిదుష్టులచే
జగం బెంతయుఁ బీడింపఁ బడుకతనఁ దద్భారం బోర్వక పుడమి నిన్ను
శరణంబు వేఁడెడి, హరిహరాదుల కసాధ్యు లగురక్కసులు నీచే సాధిం
ప నగుదురు కావునఁ దత్సంహారంబొనరించి భారంబు దీర్పు మనవుడు
నిందు్రిండిట్లనియె. ౩౯౩

ఉ॥ ఏరును శక్తిశూన్యు లయి యెప్పనిఁ జేయఁగ లేరు బ్రహ్మకున్
భారతి లచ్చి విష్ణునకుఁ బార్వతి శూలికి నుంటఁజేసి వీ
రారయ నాత్మకార్యములయందు సమర్థులు తత్సహాయతా
ధారము లేమి వీరు ప్రభుతాగతికిన్ దగువార లౌదు రే. ౩౯౪
వ॥ హరి యిట్లనియె.

గీ॥ నీదుకళ మాకు నొక్కింత నెగడదేని, నేము ముగుర మశక్తుల మిం
త నిజము, నీవు తో డింతయును లేక నిఖిలకృతుల, యందు ధా
రాళగతి నూని యుందు వంబ. ౩౯౫

వ॥ నావుడు జగదంబ సంతుష్టయై సురలంగాంచి యాగమనకా
రణం బేమనవుడు వార లిట్లనిరి. ౩౯౬

క॥ భూపాలకు లెల్లరుఁ గడుఁ, బాపాత్మతఁ దన్నుఁ గస్తి పడఁ జేయఁగ
నయ్యాపద కోపక భార,వ్యాపృతయై పుడమి వగచు నరయుముతల్లీ
వ॥ తద్భారంబు దీర్చుటయ మాకభిమతం బని వెండియు,

సీ॥ దానవకోట్లతో దర్పించి యెదిరినమహిషాసురుని రూపు మాప
లేదొ, శుంభనిశుంభుల గాంభీర్య మెడలించి రక్తబీజుని నేల రా
య లేదొ, చండముండాది రాక్షసుల నుక్కడఁగించి ధూమ్రలోచ
నుతల దుంచ లేదొ, దుర్ముఖదుస్సహాదులఁ దునుమాడి కరాళు
నంతకపురిఁ దోల లేదొ; గీ॥ జనని నీచేతఁ ద్రెళ్ళినదనుజు లెంద,
ఱో వచింపఁగఁ దరమె భూదేవి భార, మును హరింపఁగదమ్మ మా
మ్రొక్కులను గ్ర, హింపఁగదవమ్మ నీకన్న నెఱుఁగమమ్మ. ౩౯౮

క॥ నావుడు జగదంబ మొగం, బావిర్భూతస్మితోదయంబుగఁ బలికెన్
దేవతలతో సదభ్రశు,భావహకాలాభ్రగర్జితాకృతి చెలఁగన్. ౩౯౯

గీ॥ అలజరాసంధముఖ్యుల నన్యదుష్ట, నరపతుల నందఱ హరింప నా
మనమ్ము, నందు యోజించి యుంచితి నమరులెల్లఁ, బుడమిఁ బు
ట్టుండు స్వస్వాంశముల రయమున. ౪౦౦

గీ॥ యాదవకులమ్మునను బుట్టు ననఘుఁడైన, కశ్యపుఁడు వసుదేవుఁడై
కాంతతోడఁ, బొడము భృగుశాపమున విష్ణువును నతనికి, బుత్త్రుఁ
డై యేను నందునిపుత్త్రి నగుదు. ౪౦౧

క॥ నందునకు యశోదకు నే, నందనినై పొడమి యొకఁ డనఁగ నేల పోసం
గంచగుననిష్కృతుల నా, నందమునై నిర్వహింతు నవనవగతులన్.

గీ॥ బంధనాగారగతుఁ డగుపద్మనేత్రు, గోకులమ్మున కనిపెద గూఢవృత్తి
దేవకీగర్భగతు శేషుఁ దిగిచి రోహి, ణీలతాతన్వికడుపున నిలుపు
దాన. ౪౦౩

క॥ బలరామకృష్ణు లిద్దఱు, నలయక మచ్ఛక్తియుక్తు లగుకతన దురా,
త్ములద్వాపరాంతమున ని, శ్చలగతి భూపతుల నెల్లఁ జంపుదు
రెలమిన్. ౪౦౪

గీ॥ ఇంద్రునంశమ్మునన్ జనియించు నర్జు, నుం డతఁడు మాపునరవర
మండలంబు, యముఁ డనిలుఁ డశ్వినులు కారణముగ ధర్మ, జుఁ
డును భీముండుఁ గవలును బొడమఁ గలరు. ౪౦౫

వ॥ వీరును వస్వంశసంభూతుం డగుభీష్ముండును దుష్టహరణంబు విశేషించి యొనర్తు రింతేల వీరు నిమిత్తమాత్రులుగా నిఖిలంబు నేన నిర్వహింతు మీరు మీమీపొందుపట్ల కరుగుం డని మఱియును.

ఉ॥ క్షత్రియజాతినెల్లఁ జెలుచన్ హరియింతు రణావనిన్ గురు
క్షేత్రమునన్ దమంతన నశింతురు యాదవులున్ క్షణమ్మునం
జత్రగతిన్ బ్రభాసమునఁ జే టగుత్కృష్ణయు నోర్వలేమియున్
ధాత్రుని దేశమున్ ధరణిదైవతశాపము నేకమై తగన్, ౪౮౭

క॥ పిమ్మటఁ గృష్ణుండును దే,హమ్ము విడుచు శాపకలన నఖిలసురలు! మీ
రిమ్మెయి గోకులమున మధు,రమ్మహిళలతో జనింప రమణన్ జనుఁడీ.

వ॥ అని యానతిచ్చి యోగమాయాస్వరూపిణి యగుసజ్జననియుఁ గనుమొఱఁగినంత నమరులు స్వస్థానమ్మున కరిగిరి ధర సర్వసస్యోపేత మై సుస్థిరమ్ముగ నుండెఁ బ్రజలెల్లరు సుఖులైరి ద్విజులును మునులును సంతుష్టాంతరంగులై స్వధర్మనిర్వహణంబున జాగరూకులై యుండిరి.

క॥ విను జనమేజయ! యదుకుల,మున సరసిజలోచనుండు పొడమునిమిత్తం
బనివార్యం బగుశాపం,బును మాయాబలముఖ్యలిసముద్ధరణంబున్

గీ॥ ఎల్లరకు నెల్లశక్తుల నేపరాంబ, కలుగఁగాఁ జేయు నాశక్తి బలము
కలిమిఁ, గలిగె విష్ణువునకు గర్భకష్టమింక, నితరు లీమాయ దాఁటు
రేమొ చెప్పుము. ౪౮౮

వ॥ రామావతారమ్మున సతినిమునుపడ్డ బన్నములు విని యుం టివికదా! వేయునేల! యోగీంద్రులును “నేను నాయది” యను మహా పాశమ్మునఁ దవులుకొని తన్నివృత్తికై యాజగజ్జనని నారాధింతురు.

క॥ లవలేశమేని నరుఁ డే,భువనేశ్వరి భక్తికలనఁ బొగడిన ముక్తి
స్థవిరతఁ గాంచునో యాపెవి,భవ మేరికినేని వినుతిపాత్రము కాదే

వ॥ విద్యయు నవిద్యయు నని యప్పరశక్తికి రెండు రూపమ్ములు గలవు. విద్యకతమున ముక్తియు నవిద్యకతమున బంధమ్మును గలుగు నని యెఱుంగునది. ౪౮౯

క॥ అవతారము లన్నియు న, య్యావిద్యచే యంత్రితమ్ము లగుకత
మున విష్ణువు తత్తద్బంధనములఁ, దవిలి సుఖాసుఖము లనుగతము
లుగ మెలఁగుఁడా. ౪౧౭

క॥ హరిగాని హరుఁడు గానీ, సరసిజసంభవుఁడు గాని చంద్రార్కసురే
శ్వరధనదయమధనంజయ, వరుణాదులు గాని యెఱుఁగు పరతం
త్రులుగాఁ. ౪౧౮

వ॥ మఱియు వసిష్ఠవామదేవ సనకసనందనాదిమహామును లం
దఱును దద్వశులకా యెఱుంగుము. ౪౧౯

గీ॥ హర్షశోకాది భావమ్ము లమరుచుండు, దేహ మున్నంతదనుక సం
దేహమేల, సురల నమరు లటంచు నిర్జరు లటంచుఁ, బల్కుదురు
కొంద ఱది సరిపడునె యెందు. ౪౧౭

గీ॥ ఆయు వధికంబు నల్పంబు నగుటవర్క, బ్రహ్మ మొదలుగ మశకం
బు పారముగ స,మానగతి నొప్పు మరణ; మమరు లనంగ, నిర్జరు
లనంగ నెవ్వ రోనృపవరేణ్య. ౪౨౦

క॥ జననము మరణము ననునివి, జనవర! చక్రక్రమంబు చందంబున నొ
ప్పు నొకనికిని శాశ్వతమునఁ,జనునే!మాయాకృతంబు సకలంబరయఁగా

వ॥ అమ్మాయ యెంతదనుక నలవడు నందాఁక నెవ్వాండును
ముక్తుండు గా నేరఁ డుత్పత్తికాలమ్మునఁ బుట్టువెట్లగు నట్లు నాశకాల
మ్మున యథాక్రమంబుగ నందఱకును నాశం బొదవు నిట్లుండ. ౪౨౨

గీ॥ ఎవ్వఁడు నిమిత్తమాత్రమ్మె యెవనిఁ జంపు,నతనిఁ దత్కర్తగా లో
కు లందుర్రి విధివ,శ మ్మని యెఱుంగఁ జాలరు సౌఖ్యమేని, గష్టమే
నియు నొక్కఁడేఁ గలుగు టెట్లు. ౪౨౩

ఉ॥ అందఱకుఁ సుఖప్రదు లటంచు వచించెడిసూర్యచంద్రు లే
కుంచును జెంద రేమొ కనుఁగొమ్ము దినేంద్రునిపుత్రుఁ డిస్సిరో!
మందుఁడు చంద్రుఁ డంకమునమగ్గు క్షయామయబాధఁ జెందు నే
మందు! విధి ప్రిచారము మహాత్ములకేనియు దాఁటరాదు గా.

ఉ॥ వేదములన్ రచించిసవివేకి చతుర్ముఖుఁ డాతఁ డాత్మదా
యాద సరస్వతిం గని స్మరాతురుఁ డయ్యె హరుండు దక్ష దా

యాద మృతింగనంగ మదనాగ్నికిఁ దాళఁగలేక సూర్యదా
యాదజలమ్మునం బడఁగ నానది నల్లవడెన్ దదాదిగన్, ౪౨౫

వ॥ ఆతం డొక్కనాఁడు క్రీడాసక్తుండై నగ్నభావమ్మున భృగు
వనమ్మున కరిగిన నమ్మునీంద్రుండు కనలి నిర్లజ్జుండ వగునీలింగంబు
పతితం బయ్యెడు మని శపించెఁ బడంపడి యతండు దానవనిర్మితం
బగునమృతవాపీరసంబు పానంబు చేసె నిదియిట్లుండ నింద్రుండు వృష
రూపమ్మున నొకభూపతికి నొక్కెడ వాహనంబయ్యె మఱియు. ౪౨౬

క॥ పరమపురుషుఁడఁట! హరియఁట!, కరము వివేకంబు గల్గుఘనుఁ డా
నఁట! బం, గరుమృగమునిజం బెఱుఁగక, త్వరపడి యద్దాని వెంటఁ
దవులుట తగవే. ౪౨౭

క॥ మాయాబల మేరికి దుర్, జ్ఞేయం బక్కటనఁ గాదె శ్రీరాముఁడు
కామాయత్తుండై సతిఁ గో,ల్పోయిఁ యడుగఁ దొడఁగె వృక్షముల
నవ్వనిలో. ౪౨౮

ఆ॥ వె॥ నాదు భార్య జనకనందిని సౌందర్య, నిధి సుశీల సీత నిరుపమా
న, నెవ్వఁ డపహరించె నేయెడ కరిగెఁ జె,ప్పంగరాదె పాదపమ్ము
లార. ౪౨౯

ఉ॥ తమ్ముఁడ లక్ష్మణా! యవితథమ్ముగఁ బ్రాణములం ద్యజింతు నే
నిమ్మెయి నీవు నట్లు త్యజియింతువు నీయనుజుండునుం ద్యజిం
చు మ్మనతల్లులుం దెగుట చోద్యమె కైకయు నాపెపుత్రుఁడున్
సమ్మదలీల రాజ్యమును సల్పుదు రక్కట! సీత పోయెనే. ౪౩౦

ఉ॥ రాఁగదవే మృగాక్షి! నను రంజనసేయఁగదే లతాంగి! నా
రాగ మెఱుంగవే తరుణి! రాముఁడ గానఁటవే నెలంత! వే
వేగ నను గ్రహింపఁగదవే మదవేల్లితదంతిగామినీ!
యీగతి నన్ త్యజింపఁదగవే నగవే యిది నీకు మానినీ! ౪౩౧

గీ॥ నిన్ను విడనాడి బ్రతుకంగ నేర నంచు, నీ వెఱుంగవె నీయెడ నేమి
లోప, మాచరించితిఁ ద్వదధీను నరసి నన్ను, దీను నోదార్ప నిట
కరుదేరఁ దగదె. ౪౩౨

ఉ॥ ఈగతి నవ్వనాంతరము నెల్లను జూచి ధరాత్మసంభవన్
దాఁగనలేక సర్వజనతాగతి యారఘురామమూర్తి వే
వేగఁ గపీంద్రునిన్ శరణు వేఁడి తదీయసహాయతన్ రయం
బొగతి వార్ధిఁ గట్టి రణమందు జయించె నవఘ్యు రావణున్ ౪౩౩

ఉ॥ రావణకుంభకర్ణు లనురాక్షసవీరులఁ జంపి జానకిన్
బావనశీలఁ జూచి "యలపాతకుఁ బొందితి వంచుఁ బల్కె నా
రా! విధి సర్వముం దెలియునట్టి మహాత్మున కెంత వచ్చెఁ ద
ద్భావ మెఱింగి తా నిడిమెఁ బావకశోధ ధరాత్మజాతయున్.

క॥ పిమ్మట నవ్వనితం గొని, సమ్మదమున నుండె రామచంద్రుఁడుమా
యన్, సొమ్మసిలి యిట్టు లవతా, రమ్ముల విష్ణుండు మిగుల భ్రాంతిం
బొరయున్ ౪౩౪

క॥ విను శ్రీకృష్ణునిచరితం, బును వచియించెదను నతనిపుట్టువునకునో
జనమేజయనరవర య, య్యనిమిషకార్యంబ ముఖ్య మగుఫలము
సుమీ. ౪౩౫

శా॥ కాళిందీపులినమ్మునన్ విపులశాఖాశోభివృక్షావళీ
హేలాందోలత నొప్పెడి న్మధువనం బిందిందిరానందమై
కాలాభీలబలాధికుండు లవణాఖ్యాకుండు నాజన్మదు
శ్శీలుం డమ్మధుపుత్రుఁ డవ్వనమునన్ జేయు న్నివాసంబొగిన్. ౪౩౬

మ॥ ధరణీదేవుల బాధ పెట్టుచు నితాంతమ్మున్ వరప్రాప్తదు
ర్భరగర్వమ్మున నిక్కునద్దనుజు సత్త్రాణుండు శత్రుఘ్నుఁడు
ద్ధురుఁడై ద్రెళ్లఁగ నేసి యవ్వనమునం మన్ బట్టణ మ్మొక్కఁడున్
ధరణీరత్నము నాఁగఁ గట్టె మధురానామంబు చెన్నారఁగన్.

వ॥ అమ్మధురాపురమ్మునకుఁ బదంపడి తనపుత్రులఁ బుష్కరా
క్షుల నిరువుర నొడయలుఁగ జేసి యరుగుడుఁ గొండొకకాలమ్మునకుఁ
దద్వంశంబు క్షయం బగుకతన నపహరి యాదవులకువశమయ్యె. ౪౩౮

గీ॥ ముక్తిదం బగునప్పురమ్మును యయాతి, తనయుఁ డగుశూరసేనుఁ
డుద్ధతబలాఢ్యుఁ, డేలు నతనికిఁ బుత్రుఁడై యెసఁగెఁ గశ్యపుఁడు
వరుణశాపమునఁ జేసి భూవరేణ్య. ౪౪౦

వ॥ అతండు వైశ్వానరుండగుకతన నమ్మధురాపురంబు మధు వంశసంభవుం డగునుగ్రసేనుం డేలుచుండె నతనికొమరుండు కంసుండు కశ్యపుభార్య యగునదితి దేవకతనూజన్మై దేవకినాఁ బరఁగి కశ్యపాంశంబున జనియించినవసుదేవునకు భార్యయయ్యె. ౨౨౧

క॥ దేవకుఁడు దేవకిని, వసుదేవున కిడి పెండ్లి చేసె దేవహితముగా
నావేళ నంబరమ్మున, నావిర్భవ మందె నిట్టు లశరీరవాణి బలుకుల్.

క॥ విను మీ దేవకి కుదయిం, చినసంతానమున మిగులఁ జేవం దగువాఁ
డెనిమిదవకొమరుఁడాతఁడు,నినుఁదునుమునుంజుమ్ముకంస! నిర్జరహితుఁడై

వ॥ అనునయ్యాకాశవాణిపలుకులకుఁ దలరి కంసుండు చింతాక్రాంతుండై తనమరణం బిక్కోమలిం జంపినఁ దప్పు నని యట్లొనరింప నుంకించి నిజాంతర్గతంబున. ౨౨౨

గీ॥ చెలియ లుత్తమురాలు నాచేయు మన్న, నలుకుఁదగుఁ గాని యిబ్భంగి
పలుకులకును, దగునె యని కొంత యోజించి తనమరణము, కన్న
నొక్కింత యిది లెస్స గాదె యనుచు ౨౨౩

క॥ కాయము గలిగినఁ బాపము, ప్రాయశ్చిత్తముననైనఁ బాయం దగు
నాత్మీయశరీరము పాపో, పాయంబుననైన నిలుపఁ బాడియకాదే.

వ॥ అని నిశ్చయించి.

ఆ॥ వె॥ ఎల్లవారుఁ జూచి యిది యేమి యనుచు నాశ్చర్య మంద రయ
మొసంగఁ గత్తి, కరమునం దమర్చి కడఁగి యద్దేవకకొప్పు వట్టెఁ
బెండ్లికూఁతు రనక. ౨౨౪

గీ॥ చెలియలఁట! యించుకేనియుఁ జెట్టనలఁచి, యొఱుఁగదఁట! కంసునకుఁ
జేతు లెట్లువచ్చె, గడగడ వడంకునక్కన్నె గళము నఱుకఁ, గఠిన
చిత్తుల కెక్కడఁ గరుణ గలదు. ౨౨౫

మ॥ కరవాలమ్మున నిట్టు లాపెగళమున్ ఖండించునాలోన నా
తురుఁడై యవ్వసుదేవుఁ డడ్డపడియెన్ దోడ్తోన తత్పక్షసు
స్థిరు లౌయాదవవీరులెల్ల "నకటా! చింతింపు మెందేని యి
క్కరణిం జేయుదురే దురాత్మ! యని సంగ్రామాభిముఖ్యమ్మునన్.

వ॥ తలపడి హాహాకారమ్ము లొనర్చుచుఁ బోరాడునయ్యెడఁ గంసుం డబ్బాలిక విడిచి వారల మార్గొనియె నంత సంగరం బభంగురం బగుడు వృద్ధులెల్లరుఁ గంసు వారించి యనునయించి యిట్లనిరి.

చ॥ లలన వధించు టన్న మొదలన్ గడుఁ బాతక మంతఁబోక నీ
చెలియలు పెండ్లికూఁతుఁ రొకచెట్ట యెఱుంగదు నీకు నెంతయుం
దలఁపఁగ మాననీయ యిటు దారుణకృత్య మొనర్పఁ జెల్లునే
జెలియలిఁ జంపు దుర్మతులు శ్రేయముఁ జెందుట యెందుఁగందుమే.

ఉ॥ అంబరవాణివాక్య మిది యంచుఁ దలంపకు మెవ్వఁడో యస
త్యంబునకుం దలంకక వృథా వసుదేవునియిల్లు గూల్ప నీ
కుం బహుదుర్యశంబు నొడఁగూర్పఁగ మాయలమారియై యిటుల్
పంబినయింద్రజాల మిది పాటిగఁ జూతు రఁట మ్యధీనిధుల్ రగి౨

వ॥ అవశ్యమ్మునుఁ గాఁదగుకార్యమ్ములు కాక దీర వొకవేళ నిది నిక్కంబుగ నంబరవాణి యపల్కిన నీకుం దప్పింప వచ్చునే యని బహుభంగులఁ జెప్పినఁ గంసుంఁడునుఁ జేయునది లేక మిన్నకున్న వసుదేవుం డతని కిట్లనియె.　　రగి౩

చ॥ తలఁకకు మీదటన్ వినఁగఁ దథ్యముగాఁ బ్రతినన్ బొనర్తు నీ
లలనకుఁ బుట్టినట్టిశిశులన్ దగ నీ కిడువాఁడఁ దత్క్షణం
బలమి హరింపు మిట్టి మరియాదకుఁ దప్పితినేని నాదుపూ
ర్వులు నరకాలయంబునకుఁ బోయెడివార లటంచుఁ బల్కినన్.

క॥ వసుదేవుఁ డాడి తప్పఁడు,వసుధాస్థలి గుర్తింగినన్ విభావసుఁ డస్తా
ద్రిసమీపమ్మునఁ బొడమిన,నసత్య మిది గాదటంచు నందఱుఁ గంసున్

వ॥ తల విఱిచి యొప్పించిన నతం డతనివాక్యమ్ములు విశ్వసించి గతక్రోధుండై మిన్నకుండె వసుదేవుండు భార్యతోడఁ దనగృహమ్మున కరిగి నిర్భయుండై యుండె.　　రగి౔

క॥ పిమ్మట నద్దేవకి గర్భమ్మును ధరియించి పూర్ణభరసముపేత, త్వామ్మ
డరఁ గనియెఁ గొమరున్, గమ్మనివిలుకానికన్న ఘనుఁ డగువానిన్.

## దేవకీసుతవధ.

వ॥ అంత వసుదేవుండు దేవకిం గాంచి తనప్రీతిన నెఱపం దలఁచి యిట్లనియె. ౪౫౮

క॥ వనితా! యీబాలునిఁ గంసునిచేఁ జంపింతు ననుచు శోకింపకు మెవ్వనివశ మగుఁ బ్రారబ్ధమ్మును దాఁటఁగ ననుడు నిట్లు పోలఁతి వచించెన్. ౪౫౯

క॥ తనదుపురాకృతకర్మం, బునకుం దీర్థాటనంబు మొదలగుసుకృతమ్మున నాశమబ్బకుండునె, వినమే ధర్మనిధులైనపెద్దలపలుకుల్.

క॥ గురుతల్పగుండు కనకము, హరియించినవాఁడు బ్రహ్మహంతయు మద్యా, దరుఁడును బంద్రాంద్రాయణములు, కరము వ్రతం బెనసి శుద్ధి గాంచుట వినమే. ౪౬౦

క॥ మనువు మొదలుగాఁ గలిగిన, మునులెల్లను జెప్పు ధర్మములు నమ్మవె! శా, స్త్రనియతిఁ బ్రాయశ్చిత్త, మ్మును బొనరుచునరుఁడు పాపముక్తుఁడ కాఁడే. ౪౬౧

చ॥ అగునది కాక తీర దను టంత వివేకము కాదు యత్నమొప్పగుగతిఁ జేసి తత్ఫలము నందుట కానమె! యిట్లు కానిచోనిగమములుఁన్ మఖమ్ములు మునిప్రవరుల్ పరమౌషధమ్ములాదిగ నఖిలం బసత్యమ మదిన్ దలపోయు మువాయ మిత్రలన్.

క॥ కేవలదైవాధీనత, భావమ్మున నెంచి చిన్నిపాపని విడువం, గావచ్చునె ధర్మ్య మ్మగు, త్రోవన్ బ్రదికింపు మింత దుఃఖము కేలా.

వ॥ నావుడు వసుదేవుండిట్లను.

క॥ లలనరో! యత్నం బొనరుప, వలె నను టొప్పితిని దైవవశ మగు యత్నం, బులఫల మని యెఱుఁగుము కే, వలయత్నము వలన ఫలము వడయుట కలదే. ౪౬౪

వ॥ ఈసంసారమ్మున సంచితప్రారబ్ధవర్తమానభేదమ్మునఁ గర్మంబు మూఁడు తెఱంగు లందు సంచితవర్తమానంబులకుఁ బ్రాయశ్చిత్తంబు నివర్తకం బగుఁ గాని ప్రారబ్ధంబునకుఁ గానేరదు జీవుండు పూర్వదేహంబు విడిచి శుభాశుభకర్మానుసారంబుగ దివ్యదేహం బొండె

యాతనాదేహం బొండె ధరియించి స్వర్గనరకమ్ముల ననుభవించి పదం వడి మరలఁ బుట్టుసమయమ్మునఁ గర్మబద్ధుఁడై జనియించి ప్రారబ్ధం బను భవించుఁ గావున నిబ్బాలుం డవశ్యమ్మును గంసున కీఁ దగువాఁ డని మఱియును. ౪౬౬

క॥ ఆరయ నసార మగుసం,సారమ్మున సత్య మొకటి సార మ్మగు నె
వ్వా రర్థానిఁ ద్యజింతురు, వారల జీవచ్ఛవములు వనరుహనయనా

వ॥ కష్టసుఖమ్ములు లెక్కింపక సత్యమ్మునఁ బ్రివర్తించువారలకుఁ గ్రిమమ్మున శుభమ్ములు చేకుఱు నిక్కం బింత యెఱింగి యిబ్బాలునిఁ గంసున కిడ సమ్మతింపు మనవుడు దేవకి శోకసంతప్తయై వేపమానయ గుచుఁ గొమరుని వసుదేవున కిచ్చిన నతండు కంసుసదనమ్మునకుం జను నయ్యంబున. ౪౬౭

క॥ బాలకునిఁ గేలఁ గొని చిం,తాలేశము లేక కంసుదరికరిగెడి స
చ్ఛీలుని వసుదేవునిఁ, గని వాలాయము మెచ్చి రెల్ల పౌరులు నధిపా

క॥ ఇతఁడ మహాత్ముఁడు సత్యం,బితనియధీనంబు సఫల మీతనిజన్మం
బితనికి నితరులఁ కెన్నఁగ,శతాంశ మంతరము సత్యసమ మొకఁడున్నే

క॥ ఒడలితఁడిగ్గొన నాఁజసి,కొడుకుం గంసునకు ఘాతుకున కిడుటకు నీ
తఁడు తడఁబడఁ డక్కట! యెక్కడనేనియు నింతసత్యకర్ములుగలరే

వ॥పదంపడి వసుదేవుండు కంసునకు బాలకు నిచ్చిన నతం డతని ధైర్యమునకును సత్యమ్మునకును మెచ్చి నా కీబాలుండు మారకుండు గాఁ డష్టమగర్భం" బని కదా యంబరవాణి వచియించె నిర్నిమిత్తం బుగ వీని వధింపనేల; గృహమ్మున కరిగి వీనిం బోషించుకొమ్ము నావుడు వసుదేవుం డట్లొనరించెఁ బిమ్మటఁ గంసుండు మంత్రిల కీయుదంతంబు చెప్పిన వారును లెస్సచేసితి వని సంతసించి యాత్మగృహముల కరిగిరి.

ఆ॥ వె॥ అంత నతనికడకు నరుదెంచె నారదుం,డమ్మునీంద్రునకుఁ గ్రిమ
మ్మగఁ దగ, నర్ఘ్య పాద్యకృతులనర్పించి వచ్చిన, కారణంబు
నడుగఁగా నతండు. ౪౭౩

మ॥ పలికెం జిన్నగ నొప్పఁ గంస! వినుమీ బ్రిహ్మాదు లెల్లన్ దగన్
గలయం జేరి నినున్ హరించుటకునై కంజాక్షునిన్ దేవకీ

తలునీపుత్రునిఁగా నొనర్తు మని మంత్రం బాచరింపంగ నే
నెలమిన్ వింటి శిశున్ వధింప వకటా! యేమందు నీ తెల్వికిన్.

వ॥ నావుడుఁ గంసుం డష్టమగర్భంబ మన్మృతికిం గారణంబని
యాకాశవాణినుడివెఁ బ్రథము వధింప నేల!యన నారదుం డిట్లనియె.

మ॥ అరయన్ జాలవు దేవతల్ మిగుల మాయాకోవిదుల్ శత్రువున్
బరిమార్పం దగుఁగాని యల్పుఁ డనుచున్ బాటింపఁగారాదు త్వ
న్మరణం బష్టమగర్భజాతవశ మైనన్ దక్కువా రేడ్గు రొం
డొరులం గూడి సహాయు లైన భరమౌనో! కాదో! యూహింపుమా

వ॥ అని యతం డరిగె నంతఁ గంసుండు మరల బాలకు రప్పించి
యొకపాషాణమ్మునం బడ వైచి సుఖం బుండె నావుడు జనమేజయుండు
దుఃఖాక్రాంతుండై యిట్లనియె. ౪౭౭

ఉ॥ పుట్టినతోడనే మరణముం గన నాశిశు వంతలోనఁ దాఁ
గట్టిన పాప మేది! మునికాంతుఁడు నారదుఁ డిట్టిపాపసం
ఘట్టనకుం దలంకక కిటు కంసునిఁ దాఁ బురికొల్పనేల? యె
ప్పట్టునఁ గర్త, కారయిత, పాపమునన్ సమభాక్కు లేకదా. ౪౭౮

వ॥ నావుడు వ్యాసుండిట్లనియె.

ఉ॥ అమ్ముని సత్యవాది కలహప్రియుఁ డంతియకాని దీనఁ బా
పమ్ము గణింప లే దనుచుఁ బల్కఁగ రాదు నరేంద్ర! బాలవ
ట్కమ్మిటు కంసుచేత మృతిఁ గాంచెను శాపము కారణమ్ముగా
బమ్మకునైనఁ గర్మపరిపాకము మిన్నక పోవ నేర్చునే. ౪౭౯

వ॥ స్వాయంభువమన్వంతరమ్మున మరీచికి నూర్ణ యనుభార్య
యం దార్వురు పుత్రులు గలిగిరి వారు కొండొకకాలమ్మునఁ గామిరె
యగుసరస్వతిం గవియ నుంకించిన విరించిం గాంచి పరిహాసించుడు నతం
డలిగి “దైత్యయోనిం బుట్టుం”డని శపించిన నామడ్గర్భులును కాలనేమికి
సుతులై రెండవజన్మమ్మున హిరణ్యకశిపునకుం బుట్టి విజ్ఞానంబుకతన
విరించిగుఱించి తపం బొనరించుటయు. ౪౮౦

గీ॥ అతఁడు ప్రత్యక్షమై వారి కనియె నాఁడు, కోపయుక్తుఁడనై మీకు శాపమిచ్చి, తిని భవత్తప మిష్ట నామనము గరఁచె, వర మొసంగెద నన గర్భు లరసి యతని. ౪౮౧

క॥ వర మిడఁగ నీకు నిచ్చ య,మరిన నసురదనుజసిద్ధమానవులు మముం బొరయింపలేమి నొసఁగుము, స్థిరజీవుల మగుదు మనుడుఁ జెచ్చెర నొసఁగెన్. ౪౮౨

వ॥ అంత హిరణ్యకశిపుండు కొమరులం గాంచి “నన్ను విడిచి మీరు చతురాననుం గుఱించి తప మ్మొనరించి వరంబు వడసి యవమా నించితిరి కావున మీరు నాకడ నుండఁ దగరు పాతాళమ్మునకుం బోయి యెల్లవేళ నిద్రాధీనులై చిరముండి పదంపడి దేవకీగర్భమ్మునం బుట్టునది.

క॥ వెనుకటిజన్మమ్మున మీ, జనకుం డగు కాలనేమి జనియించును గం సునిఁ పావము గొని యాతఁడ, జనియించిన యప్డ మిమ్ముఁ జంపెడు మనుచున్. ౪౮౪

వ॥ శాపం బొసఁగె నది కారణంబుగ షడ్గర్భులు దేవకి కుద యించి కంసునిచేఁ జచ్చిరని మఱియు నిట్లనియె. ౪౮౫

గీ॥ కంసుచెలియలు సప్తమగర్భ మంతఁ, దాల్చె శేషాంశమున దానిఁ దారుమాసొ, నర్చె నమ్యోగమాయ జనంబు లాపె, గర్భ మెడలె నటంచు విభ్రాంతులైరి. ౪౮౬

వ॥ కంసుఁడును నైదవమాసమ్మున దేవకికి గర్భపాతంబాదవె నను మాట విని సంతసించె నాశిశువును రోహిణీగర్భమ్మున వృద్ధిఁ బొందు చుండె నంత దేవకియు మరలఁ జూలు దాల్చె. ౪౮౭

క॥ ఎనిమిదవగర్భమున స, త్త్వనిధి సరోజాక్షుఁ డెలమి ధరణీభారం బును దీర్చ దేవకార్యం, బొనరింప నసించె సంతతోజ్జ్వలదీప్తిన్.

వ॥ అట్లు దేవత లందఱును దమతమయంశమ్ముల నుద్భవించి రీతెఱంగు సంక్షేపమ్ముగ నాలింపుము. ౪౮౯

క॥ వసుదేవుఁడు కశ్యపుఁ డ, వ్వసుదేవునిభార్య యదితి పార్థివ! శేషాం శసముద్భూతుఁడు బలరా,మసమాహ్వాయుఁ డింక నొక్క మర్మము వినుమీ. ౪౯౦

క॥ నరుఁడును నారాయణుఁడును,నరయఁగ ధర్మునికుమారు లని తెల్పితి
న, న్నరుఁ డర్జునుఁడై పుట్టె, న్నరవర! కృష్ణుఁ డయి పుట్టె నారాయ
ణుఁడున్. ౭౯౧

వ॥ మఱియు ధర్మాంశమ్మున విదురయుధిష్ఠిరులును ననిలాంశ
మ్మున భీముండును నశ్వినులయంశమ్మున నకులసహదేవులును సూర్యాం
శమ్మునఁ గర్ణుండును బృహస్పతియంశమ్మున ద్రోణుండును. యమరుద్ర
కామక్రోధమ్ముల యంశమ్మున నశ్వత్థామయుఁ బుట్టిరి. శంతనుండు సము
ద్రాంశమ్మునఁ బొడమె. ౭౯౨

గీ॥ శంతనుండు సముద్రాంశజనితుఁ డైన,కతనఁ బతి గాఁగ వరియించె
గంగ యతని, వసువు భీష్ముండు గంధర్వనరుఁడు దేవకుఁడు మరు
ద్గణ మవ్విరాటుఁడు నృపాల. ౭౯౩

వ॥ కృపాచార్యుండును గృతవర్మయు మరుద్గణాంశసంభవులకా
మెఱుంగునది అరిష్టనేమిసుతుం డగుహంసుఁడు ధృతరాష్ట్రుండు కలి
దుర్యోధనుండు ద్వాపరంబు శకుని సోమప్రరువనుయాదవుఁడు సువర్చుం
డనుసోమపుత్రుండు ధృష్టద్యుమ్నుం డనలాంశసంభవుండు శిఖండి
రాక్షసాంశసంభూతుండు ప్రద్యుమ్నుండు సనత్కుమారుండు వరుణుండు
ద్రుపదుండు లక్ష్మి ద్రౌపది పాంచాలీపుత్రు లేవురును విశ్వేదేవాంశ
జులు. ౭౯౪

క॥ కుంతియు మాద్రియు ననునీ, యింతులు సిద్ధియును ధృతియు నృప!
గాంధారీ, కాంత మతి వేలుపులరో, యింతులు పదియాఱువేలు
కృష్ణునిభార్యల్. ౭౯౫

వ॥ ఇంక నసురాంశజుల వినిపింతు హిరణ్యకశిపుండు శిశుపా
లుండు విప్రజిత్తి జరాసంధుండు ప్రహ్లాదుండు శల్యుండు కాలనేమి
కంసుండు హయశిరుండు కేశి గోకులమ్మున వధింపఁ బడినకకుద్మి యను
వాఁడు బలిపుత్రుం డగునరిష్టుండు అనుహ్లాదుండు ధృష్టకేతుండు బాహ్లి
లుండు భగదత్తుండు లంబుండు ప్రలంబుండు ఖరుండు ధేనుకుండు
వారాహకిశోరు లనునీయిరువురు రక్కసులును జాణూరముష్టికులను
మల్లులు దితిపుత్రుం డగునరిష్టుండు కువలయాపీడంబనుగజము బలిపుత్రి

బకి తదనుజుండు బకుఁ డిట్లు సురాసురలయంశమ్ముల ననేకు లుద్భవించి
రని వెండియు. ౪౯౬

చ॥ అమరులు బ్రహ్మఁ గూడి తను నారసి ప్రార్థనఁ జేసి భూమి భా
రము హరియింపు మన్నపుడు రాక్షససూదనుఁ డిచ్చె రెండు కే
శములు సితాసితమ్ములు వెసన్; హరి శ్యామఁ గృష్ణుఁ డయ్యెఁ దె
ల్పు మరేఁ దదగ్రజాతునకు నయ్యది హేతువుగాఁగ భూవరా. ౪౯౭

వ॥ ఈయంశావతరణం బెవ్వారలు భక్తిభావమ్మునఁ జదువుదు
రవ్వారికి సమస్తశుభమ్ములు కరతలామలకమ్ము లట్లు దేవకీపుత్రుల నార్వు
రఁ జంపి యేడవగర్భంబు పతితం బగుట యెఱింగి యష్టమగర్భమ్మును
ప్రయత్నమ్మున హరింపఁ గంసుం డున్నంత. ౪౯౮

క॥ హరి దేవకికడుపున సు, స్థిరుఁడై వసియించె నపుడ దేవహితముగా
నరుదెంచి యోగమాయయుఁ, గర మలరారెన్ యశోదగర్భము
నందున్. ౪౯౯

ఆఁ వె॥ గోకులమున రోహిణీకాంత కుదయించె, రాముఁ డంతఁ గాంతి
ధాముఁ డగుచుఁ, గంసుఁ డతిభయమునఁ గారాగృహమ్మున,
నుంచె దేవకిని మదోద్ధతుండు. ౫౦౦

క॥ అట్లుంచి భృత్యుల నటఁ గావ నియోగించె వసుదేవుఁడును
భార్యాస్నేహాయత్తచిత్తుండై యాపెతో సకారాగారమ్ముఁ బ్రవేశించి
కుమారోదయమ్ము చింతించుచుండె నంత దేవకార్యార్థి యగువిష్ణుండు
దేవకీగర్భమ్మున నమగసంస్థాయమానుండగుచుఁ గ్రమమ్మున వృద్ధిఁ జెంద
దశమాసస్ఫూర్తి యయ్యె. ౫౦౧

## శ్రీకృష్ణోదయము.

గీ॥ శ్రావణమ్మునఁ గృష్ణపక్షమున రోహి, ణీకలిత మైనయష్టమి నాకులత్వ
మడరఁ గంసుండు దైత్యుల నరసి పల్కు, నష్టమం బిది గర్భంబు
కష్టదంబు. ౫౦౨

ఉ॥ దీనఁ జనించుబాలకుఁడు తెల్లముగా ననుఁ జంపు నిక్క మె
ట్లైనను వీనిఁ జంపవలె నప్పుడు నిద్దుర పట్టఁగా వలెన్

లేనియెడన్ సుఖమ్ము లేక లేవు శ్రమంపడి మీర లందఱున్
బూనికఁ గాచి యుండవలెఁ బుట్టినతోడనె చెప్పఁగావలెన్. ౧౦౩

వ॥ అని వారల నియోగించి గృహమ్మున కరిగి చింతావిష్టుండై నిద్రాదికం బెఱుంగక యొకభంగి నతఁ డుండె రక్కసు లందఱును దమతమయాయుధమ్ములు ధరియించి జాగరూకులై కాచుచుండి రయ్యెడ దేవకి వసుదేవున కిట్లనియె. ౧౦౪

క॥ అసహాయ నైననాకున్, బ్రసవసమయమాయెఁ జేయుపని యే మిట ర
క్కసులు నలుగడలఁ గాపుగ, నసమానబలాఢ్యులుండి రకట! మ
హాత్మా. ౧౦౫

వ॥ మున్ను నందునిపత్ని యగుయశోదకును నాకును నొక్కసమయంబు గలదెట్లంటేని నీకుం బొడమునపత్యంబు మన్మందిరమ్మున కనుపుము మదపత్యంబు నీగృహమ్మున కనిపెద నావుడు వల్లెయని యే నొప్పితి నిప్పు డప్పని యెట్లు సేయ నగు నని చింతించుచు గర్భభరం బాఁగఁ జాలమి సిగ్గఱి పతి కిట్లను. ౧౦౬

క॥ భర మాయె గర్భవేదన, యడుగుము సిగ్గాయె నిన్ను నరయఁగఁ
నని స, త్వరమున మొగ మటుచేసి కొ, మరునింగనె మరుని నగు
కొమరుగలవానిన్. ౧౦౭

ఆ॥ వె॥ చెప్ప నలవిగానిచెలువున నొప్పారు,చిన్నిబాలుమోము చెలువ
గాంచి, పులకితాంగి యగుచు నెలమిని వసుదేవుఁ బిలిచి శిశువుఁ
జూపి పలికె నిట్లు. ౧౦౮

క॥ కనుఁగొను మాముఖకాంతియుఁ, గనులవిశాలతయుఁ జెలువుగల
మృదుకాయం, బును నెన్నఁడేని యిట్టిఁడు, జనియించెనె యేరికేని
సదనులహృదయా. ౧౦౯

ఉ॥ వచ్చెడివానికిన్ మిగులఁ జందముఁ జందము గల్గు నంచు వి
ద్వచ్చయ మాడుమాటలు వృథా యగునే! యెటులేఁగ నేర్చె దీ
విచ్చియుతేన్ జగమ్మఖిల మేలెడితేజము బొల్చువానిఁ గా
ర్చిచ్చన నొప్పుకంసునకు జీవవిఘాతికిఁ జేతులారఁగన్. ౧౧౦

వ॥ అనవుడు వసుదేవుం డశ్రూమరుమొగం బాలోకించుచు నితి కర్తవ్యతాశూన్యుండై యున్నంత నాకాశవాణి విశదాక్షరంబుగ నతనిం బిలిచి యిట్లనియె. ౫౧౧

ఉ॥ అందఱు రక్షకుల్ నిదుర నందిరి నాపెనుమాయకల్మి, దీ
నం దగుతల్పులుం విడియె నావలనన్ వినుమింక నడ్డు లే
దెంమను; వేగ నీశిశువు నెత్తియురమ్మునఁ బట్టి గోకులం
బందు యశోదగేహమునయందిడు మేటికి సందియం బికన్. ౫౧౨

వ॥ పిమ్మట వసుదేవుండు బాలకు నెత్తికొని విశృంఖలుండై వివృతమ్ము లగునాయష్టద్వారమ్ములు దాఁటి యోగమాయాప్రభావమ్మున నేరికి నలక్షితుండై జవుజవ్వనఁ గాళిందీతటమ్మున కరిగి యిది యెట్లు తరింప నగునని యెంచునాలోన నయ్యేదియు మొలబంటి యగుడుఁ జయ్యన గోకులమ్మున కరిగి నిర్జనం బగుమార్గమ్మున నందు మందిరంబు సొచ్చి తద్ద్వారమ్మునఁ బహుళవిభూతిం జూచుచుండె. ౫౧౩

గీ॥ అంత నందునిభార్యయుఁ దవతరించె,యోగమాయాంశసంపన్న యొక్కబాల, దాని వసుదేవునకు నిచ్చి తనయుఁ గొనియె, దాదినెపమున నజ్జగదాది దేవి. ౫౧౪

వ॥ పిమ్మట వసుదేవుండ బ్బాలం గొని కారాగారమ్మున నున్న దేవకిప్రక్క నునిచి తానును సమీపమ్మునఁ జింతావిష్టుండై యుండు నంత. ౫౧౫

క॥ ఆకొమరె మెల్ల మెల్లన, ప్రాకృతబాలికయుఁ బోలె బహుమధురరస, శ్రీకలితంబుగ నేడువ, వే కళవళమంది లేచి భృత్యులు కడఁకన్.

ఆ॥ వె॥ కంసుకడకు నేగి కనియె దేవకి పుత్రి, నరుగుదెమ్ము వేగ మనుడు నతఁడు, నరిగి తలుపు దీయు మనుచు నవ్వసుదేవుఁ,బిలిచి యిట్టు లనియె నలుక వొడమ. ౫౧౬

క॥ ఎనిమిదవగర్భ మియ్యది, ననుఁ జంపఁగ నెంచి దీన నారాయణుఁడే జనియించు నంచు వింటిన్,ఘనుమంగా వలదె యిటి దుష్టుని శిశువున్

వ॥ జాగు సేయక తె మ్మనుడు భయత్రస్తుండుంబోలె వసుదేవుండు చింతించుచు నబ్బాలం దెచ్చి కంసునిహస్తమ్మునం బెట్టిన నతండు చూచి సంశయగ్రస్తుండై నిజాంతర్గతమ్మున. ౧౧

ఉ॥ ఏమిది! క్రొత్త పుట్టె మృష యెట్లగు నంబరవాణిపల్కు! మి
ధ్యామతి నారదుం డనృత మాడునె! యివ్వసుదేవుమాయ నా
గా మన మెట్టు లొప్పికొను! గాచెడివారలు చుట్టునుండ గ
న్యామణి యెడవచ్చె సుతుం డక్కట యెక్కడికేగె జిత్రమా.

క॥ కాలగతి విషమ మని చింతా, లోలుం డగుచు బాల నంఘ్రులం
గొని యా, భీలగతి బిట్టు వైచెన్, దూలి యుపలమందుం బడంగ
దుంముడుకు మెయిన్. ౧౨

వ॥ అక్కులపాంసనుం డిట్లొనర్చిన నబ్బాల కరమ్ముమండి జాఱి నంతన యుప్పరమ్మున కెగసి దివ్యరూపధారిణియై మృదుస్వరమ్మున నిట్లనియె. ౧౨

క॥ ననుం జంపినంత నేమగు, వినుమో దుష్టాత్మ! మిగుల వీరుండు నీకై
జనియించినాండు వృద్ధిం, గనుమన్నాం డతండు నిజము గశతేర్చు
నినున్. ౧౩

వ॥ అని నుడివి తనంత నరిగెం బిమ్మటం గంసుం డతివిస్మితుండై తనగృహమ్మున కరిగి బకధేనుకవత్సకప్రలంబముఖులం గాంచి యిట్లను.

ఉ॥ గోకులమందుంగాని మఱి కొంకక యెచ్చటం గాని పుట్టు దు
ష్ప్రాకులం బాకులన్ విగతసంశయులై వధియింపుం డిందఱు
న్నా కరయ జాగరూకతం గనం దగుం బూతన బాలహంత్రి దా
నీ కృతి యందు నేర్పుగల దెంతయు నయ్యది మీకుం దోడగున్.

వ॥ ఇట్లు నియోగించి చింతావిష్టుండై యతం డుండె నంతం బాతఃకాలంబయ్యెం బదంపడి నందుండు సంతుష్టాంతరంగుండై పుత్రోత్సవం బొనరించె. ౧౬

క॥ నందుండు పుత్రోత్సవ మూ,నందగతి నొనర్ప నదియు నాలుగు దెసలం
బొందుపడెం గింవదంతిగ, నందంద చరించువారు లతిరభసముగన్.

వ॥ కంసుకడ కరిగి నుడివిరి యంతకుమున్న యతండును నారదునిచే బోధింపఁబడినవాఁడగుట గోకులమ్మువంక నతిక్రోధమ్ముగలఁడై యుండె నంత. ౹౹౨౭

## శ్రీకృష్ణలీలలు.

ఉ॥ పూతనఁ జంపె ధేనుకు నపూర్వబలుంగా వధియించె వత్సకుం
బాతకు నబ్బకాసురునిఁ బట్టి యడంచెఁ బ్రలంబుఁ జెండె గో
జాతమురక్షసేతకు వెసం గిరి యెత్తె నటంచు వించు న
త్యాతురుఁడయ్యెఁ గృష్ణునెడ నాత్మవధంబున నిశ్చితాత్ముఁడై.

వ॥ పదంపడి కేశి యనురక్కసుంగూడ దనుమాడుట యాలించి యుపాయమ్మునఁ గృష్ణు వధింప నెంచి ధనుర్యాగంబు నెపమ్మున బలరామ కృష్ణుల రప్పించువాఁడై యక్రూరుం బనిచిన నతం డరిగి రథం బెక్కించుకొనివారలం దోడికొని వచ్చె నంత. ౹౹30

గీ॥ ధనువు భంజించి రాజుల దర్ప మడఁచి, గజము వధియించి చాణూరుఁ గసిమసంగి, ముష్టికునిఁ జంపి శలుని నిర్మూలుఁ జేసి, తోశలు హరించి రిపువు రుద్ధురత మెఱయ. ౹౹3౧

మ॥ సిగచేతం గొని పట్టి యీడ్చి సమరస్థేమాభిరామత్వ మొ
ప్పగఁ గంసుం బరిమార్చి లీలమెయి నంబాశృంఖలల్ వాపి బం
ధగతుం దండ్రి వదల్చి రాజ్యమునకు న్నాథుండుగా నుగ్రసే
నుఁ గడుం వృద్ధు నలంకరించె హరి తన్నుం నిర్జరుల్ మెచ్చఁగన్.

వ॥ పిదప వసుదేవుం డబ్బలరామకృష్ణుల కుపనయనం బాచరించి సాందీపనునొద్దకు విద్యాభ్యాసమ్మున కనిచెఁ బదంపడి వారు గురుకులవాసమ్ము చేయుచు సమస్తవిద్యల నభ్యసించి ద్వాదశాబ్దమ్ములవారయి మధురాపురమ్మున సుఖమ్మున నున్నయెడ నల్లునిమరణంబు విని కలుషితాంతరంగుం డై నజరాసంధుండు మధుర నటికట్టి ఘోరం బగుసంగరం బొనర్చి పరాజితుండై యరిగె నిట్లతం డేడుమార్లు కృష్ణునితోనెదిరి యోహటించి మ్లేచ్ఛాధిపతి యగుకాలయవనుం బురికొల్పవాఁడును యాదవభయంకరుండై మధురపై నెత్తివచ్చినఁ గృష్ణుండు యాదవసమక్షమ్మున బలరామున కిట్లనియె. ౹౹33

క॥ పాతకుఁడు జరాసంధుం, డీతని నంపించె వీఁడు నెంతయు బలవి
ఖ్యాతుండు ప్రబలసైన్యో, పేతుం డిత్తులువతోడఁ బెనఁగుట భరమా

క॥ ధనమును గృహమును వీడియుఁ,దనప్రాణమురక్షసేత ధర్మం బగు
సౌఖ్యనియతిఁ జొప్పడు నెయ్యెడఁ, దన కది పిత్రార్జితముగఁ దలఁ
పఁగ వలయున్. ౧౩౧

వ॥ పూర్వార్జితం బగు దేశం బెల్లప్పుడుఁ దనకు భయజనకం బేనిఁ గులోచితం బని యట వసించుటకన్న శైలసాగరనికటంబున నేని నిష్కంటకంబుగ వసించుట సమంజసం బని పెద్దలు వల్కుదురు.

చ॥ హరి శయనించు నంబునిధియం దహితల్పమునన్ భయమ్మునన్
హరుడు వసించు రాజతకులాచలగహ్వరమందు నింకఁ ద
క్కొరుల గణింపనేల! మన మొక్కమొగిన్ బురి వీడి ద్వారకా
పురమున కేగి సౌఖ్యములు పొందుట లగ్గని నాకుఁ దోఁచెడిన్.

వ॥ అప్పురవరంబు రైవతాచలంబుకడ సముద్రతటమ్మునఁ గల దనియు నతిమనోహరం బనియును గరుఁడుండు సెప్పె ననుడు. యాదవులు సమ్మతించి సకుటుంబమ్ముగఁ దరలి బలరామకృష్ణపురస్సరులై కతి పయదినమ్ములకు ద్వారవతి కరిగి యప్పురమ్మునఁగలజీర్ణగృహమ్ములఁ బున రుద్ధరణం బొనర్చి సుఖం బుండిరి పిదప బలరామకృష్ణు లిరువురును నిర్జన మ్మగు మధుర కేతెంచి యట వసించుచున్నంత యవనుండు మరల నప్పురంబు ముట్టడించె. ౧౩౨

చ॥ హరి పురి వీడి వైళ మసహాయతఁ దాఁ బదచారియై వెసం
బరుగిడె నంత వాఁడు నసమానరయమ్మునఁ బాదచారియై
యరిగెఁ బిఱుంద, నీవరున నయ్యదువీరుఁడు రక్కసుండు నో
కురువర! యేగి రంత ముచికుందునియాశ్రమపుణ్యభూమికిన్. ౧౩౩

వ॥ హరియు నయ్యెడ నంతర్ధానఁబు చేసె నయ్యవనుండు నట నిద్రించుచున్నముచికుందుం గాంచి శ్రీకృష్ణుం డని యెంచి తనకాలఁ దన్నుటయు నారాజర్షి మేల్కని క్రోధతామ్రాక్షుండై యవను భస్మసాత్కరించి కెలనఁ గృష్ణుం గాంచి నమస్కరించి సన్నుతించెఁ

బిదపఁ గృష్ణుండు బలరామసహితమ్ముగ ద్వారవతి కరిగి యుగ్రసేనుని పై రాజ్యభార మ్మునిచి తాను యథేష్టమ్ముగ సంచరించుచుండె. ౧౪౦

క॥ అసహాయశూరుఁ డగుహరి, వెస నాశిశుపాలువలన విడిపించి సమం
జసగుణ యగురుక్మిణి రా, క్షసోపయమవిధి గ్రహించె జగములు వొగడన్.

గీ॥ జాంబవతి మిత్రవిందయు సత్యభామ, నాగ్నజితి భద్రయును లక్ష
ణాతరుణియుఁ, బేర్మిఁ గాళిందియును గృష్ణుఁ బెండ్లి చేసి, కొనిన
భార్యలు సౌందర్యఖనులు భూప! ౧౪౨

క॥ ఆరుక్మిణి శ్రీకృష్ణుని, గారామునఁ గూడి కొంతకాలమ్మునకున్, జారు
తరగాత్రిఁ గనియెఁ గు, మారున్ బ్రద్యుమ్నుఁ గాంతిమహితాకారున్. ౧౪౩

వ॥ అయ్యర్భకునకు జాతకర్మాదికం బొనర్చినపిదప మాయాకోవిదుండును బలిష్ఠుండును నగుశంబరుండు సూతికాగృహమ్మునుండి యా చిన్నిబాలు హరియించి మాయావతి కొసంగిన హరి చేయునది లేక చింతార్తుండై జగదంబ నిట్లు నుతించె. ౧౪౪

క॥ మును బదరికాశ్రమమ్మున, మనమునఁ దగ నిల్పి భక్తిమై నిన్నుంగొ;
ల్చినవాఁడ గానె నాపైఁ, గనికరమున్ మఱువఁ బాడిగా! జగదంబా.

ఉ॥ ఏ నెటు నిల్వ నేర్తు జగదీశ్వరి! యెవ్వఁడో గానరాదు నా
సూనుని సూతికాగృహము చొచ్చి హరించె మదీయమాన మి
ద్దాన నడంగదే జనని! దాసులదీనతఁ జూచి యోర్వఁ జ
న్నే! నగరే నినున్ జనులు! నీకు నొకింతయు లజ్జ పుట్టదే. ౧౪౬

చ॥ నగరముచుట్టు కోటయఁట! నాగృహ మెన్నఁగ మధ్యమందు నొ
ప్పగునఁట! సూతికాగృహము నారయువార లనేకు లుండ నె
వ్వగ హరియించె బాలకు నవారణలీల; మదీయపూర్వక
ర్మగతియ కాక వేఱొకటి గానఁగ రాదు నిమిత్త మియ్యెడన్.

గీ॥ ఏను బొరుగూరికిం జన నెల్లయాదవులును గాచుచు నున్నారు
తెలివికలిమి, నెవఁడు హరియించె మత్పుత్రు నెంచి చూడ, నంబ!
నీమాయ యొకింత యమరదేని. ౧౪౮

గీ॥ మందమతు లగుమాబోంట్లకుం దరంబె, జనని! నీదుచరిత్రంబు చంద
మెఱుఁగ, బాలుఁ గొనిపోవుచోరుండు పట్టువడక, యుండఁ గల్పించి
తివి మాయ యొరులవశమె. ౧౮౯

చ॥ పతి పరదేశవర్తి యగుపట్టున రోహిణి! నిక్కమాపతి
వ్రత బలరాము నెట్లు గనెఁ! బాపవిదారిణి యన్యగర్భసం
గతు శిశువుం దగం దిగిచి కాదె తదంగనయందుఁ గూర్చి పెం
చితివి జగత్ప్రసిద్ధము విశిష్టము నీమహిమం బొకింతయే. ౧౯౦

చ॥ సకలము చేసి పెంచి పెలుచన్ హరియించెడితల్లి! నాకుఁ బు
త్రకు నిడి సంతసం బిడినదానవు తత్క్షణ మిట్టి వేదనా
వికలమనస్కుఁ జేయఁ దగవే! పగవాఁడనె! కాక నీకు ని
ట్టికృతులు బల్ముదంబును ఘటింపఁగఁ బోలు నెవం డెఱింగెడిన్.

క॥ దేవి! తనూజుఁడు సుఖముల, తావనియును సుతునిచావు తలిదండ్రు
లకున్, బ్రేవెడలుట యని చెప్పుదు, రేవెఱవున నిల్తు మొదలనే
యిటులైనన్. ౧౯౨

ఉ॥ ప్రీతిఁ ద్యజింప లేక కురరీగతి రోదన మాచరించుత
న్మాత గతిన్ దలంపు దయ మాలినదానవు కాకుమమ్మ! ప్ర
ఖ్యాతికిఁ జేటు దెచ్చుకొనఁ గా మది నెంచకుమమ్మ! నీవు గా
కీతరుణిన్ భరింప నిఁక నెవ్వరు దిక్కు! వచింపు మమ్మరో! ౧౯౩

ఉ॥ జన్న మొనర్తునో! వ్రతము సల్పుదునో! భవదంఘ్రు లెంతయుం
దిన్ననిభక్తి సూనములు తెచ్చి యజించి ముదంబు గూర్తునో!
కన్నసుతుం డొకించుకయుఁ గందును జెందక యుండెనేని నీ
కు న్నిఖిలాంబ యేమి యొడఁగూర్పఁగ నేర నశక్య మేనియున్.

చ॥ తనయునిఁ దెచ్చి నా కొసఁగి తద్దయు మోదము గూర్చు మమ్మ! నీ
పని యగుఁగాని వేఱొకరు పాల్పడ రింతటి సేఁత కంచు మ
న్ననమెయి కృష్ణుఁ డెంతయు ననాథగతిన్ విలపింప సజ్జగ
జ్జనని కృపానుషంగ యయి చయ్యన దర్శన మిచ్చె శౌరికిన్. ౧౯౫

వ॥ అట్లు ప్రత్యక్షంబై యుభయం బొసంగి నీకొమరుండు శాప
కారణంబున శంబరునిచే హరింపఁ బడి తద్గృహమ్మున నున్నవాఁడు మద

నుగ్రహమ్మునఁ దనఁ బదియాఱవయేట నవ్వాసిం జంపి నీకడ కరుదెంచు నీఁక శోకింపకు మనవుడుఁ గృష్ణుండును రుక్మిణియు సంతసమ్మునఁ జెలంగి రని చెప్పినవ్యాసునకు జనమేజయుం డిట్లనియె. ౫౫౬

క॥ నారాయణాంశమునఁ జెన్నారెడిహరి కెఱుకపడనియనువున సూత్రా
గారమున నున్నబాలుని, నేరీతి హరించె నిక్కమే నిది చెపుమా.

వ॥ నావుడు వ్యాసుం డిట్లను.

గీ॥ మనుజులు సురాసురు లోకింత మాయఁ గడవఁ,జాల రది యెంత కేని
యుఁ జాలు నెట్టి,బుద్ధిమంతునికైనను బౌర మెసంగఁ, జేయు శాం
భవి యేరిక జేయ నిజము. ౫౫౯

## శ్రీరామాదులు కించిద్జ్ఞులనుట.

వ॥ క్షుత్తృష్ణాందాతంద్రాభయశోకసంశయమోహహర్షాభిమాన జరామరణాజ్ఞానగ్లానీర్ష్యాప్రీతిమదశ్రమమ్ములను నియ్యవి దేహజమ్ము ల గుభావమ్ములు. ౫౫౯

ఉ॥ రాముఁ డెఱుఁగఁ జాలెనె యరణ్యమునం దన కగ్రవర్తియౌ
హేమమృగమ్ము రాకయు మహీసుతిపోకయు నజ్జటాయు వా
లో మృతిఁ జెందు టాదిగ; ఖలుం డగు రావణుఁ జంపి రాజ్యసు
శ్రీమితిమీఱునాఁడు మును చెందినబాముల నెన్న నేర్చెనే. ౫౬౦

గీ॥ మాయ బలవతి గాదేని మనుజనాథ!, యెఱుఁగఁ జాలెనె తనతండ్రి
మృతిని నాతఁ, డింతయేటికి సీతయున్నెడఁ దెలియఁగ, వనచరుల
నలుదిక్కుల కనుపనేల. ౫౬౧

గీ॥ నాగపాశమ్ములను బడి నవయనేల, సీత నిర్దోష యనక శాపించ్చు
నందుఁ బడుట కొప్పఁగ నేల యాపై జనాప, వాదకుఁ దలంకి తా
విడువంగ నేల. ౫౬౨

వ॥ పిమ్మటఁ దనపుత్రు లగుకుశీలవులఁగుశలవులని మునిచెప్పకున్న నెఱింగినే! ఇదియిట్లుండ జానకి పాతాళమ్మునకరుగుటయుఁ దమకుఁగాలం బాసన్నం బగుటయు దెలియ నేర్చి నే! అట్లేని దమ్మునిం జంప నుంకించు నే యని వెండియు. ౫౬౩

క॥ మానవదేహము గైకొని, మానవరీతులఁ జెలంగె మహిమ మెడలి
యా, శ్రీనాథుఁడు సందేహం,బూనఁగఁ బని లేదు దీని కుర్వీనాథా!

క॥ మొదలన్ గంసునిభయమున, యదుకులమణి యరిగె గోకులావాసం
బున్, బదఁపడి ద్వారవతిని దా, నొదిగె జరాసంధుభీతి యొదవిన
కతనన్. ౫౬౫

గీ॥ ఎంత యన్యాయ మొనరించెఁ గృష్ణుఁ డకట!, యెఱిఁగిఁ శిశుపాలుచే
హరియింపఁ బడిన, దాని రుక్మిణిఁ గైకొనె ధర్మవిదులు, మెచ్చి
కొందురె విని జనమేజయనృప. ౫౬౬

వ॥ మాయాయుక్తుం డగుకతననకదా! శంబరుఁడు హరించిన పుత్రు నెఱుంగఁ జాలక దుఃఖించి పదంపడి దేవికతనఁ దెలిసి యానందించె నిదియునుం గాక. ౫౬౭

ఆ॥ వె॥ సత్యయాజ్ఞఁ జేసి స్వర్గమ్మునకు నేగి,యింద్రుతోడఁ బోరి యెలమిఁ
గల్ప, వృక్షమల్ల సత్యగృహమునఁ బెరటిచె, ట్టుగ నొనర్చె స్త్రీ
జితగతి నతఁడు. ౫౬౮

వ॥ సత్యభామయు నానందమ్మునఁ దద్వృక్షంబు తనతోఁట నాఁటించి పతి యగుశ్రీకృష్ణుని నారదునకు దానం బొసంగి పిదపఁ గనకమయం బగుకృష్ణవిగ్రహం బమ్మహామహున కిచ్చి విడిపించె. ౫౬౯

గీ॥ అరసి ప్రద్యుమ్నుఁ డాదిగ్గొనట్టి సుతుల, జాంబవతి తన్నుఁ బుత్ర
లాభంబుకొఱకు, దైన్యగతి వేఁడఁ గృష్ణుఁడు తప మొనర్పఁ, జనియె
నుపమన్యునాశ్రమమునకు నధిప. ౫౭౦

క॥ శివభక్తుం డగునమ్మౌ, నివలనఁ బాశుపతదీక్ష నెఱిఁగొని సన్న్యా
సవిధిమెయిఁ దపము సలిపెన్, బ్రవిమలుఁడై, శివుని మదినిఁ బాదు
కొలుపుచున్. ౫౭౦

వ॥ ఇట్లు ప్రథమమాసమ్మున ఫలాశియు ద్వితీయమ్మున జలపాయియుఁ దృతీయమ్మున వాయుభక్షియునై పాదాంగుష్ఠాగ్రమ్మున నిలిచి పుత్రార్థియై తనుంగుఱిఁచి ఘోరతపం బొనర్చునాహరికి షష్ఠం డాఱవమాసమ్మునఁ జంద్రకళాధరుండై వృషభారూఢుండై యింద్రాదిసురలు పరివేష్టింపఁ బార్వతితోఁ బ్రత్యక్షంబై ౫౭౧

ఆ॥ వె॥ వాసుదేవ! నీతపమ్మున కెద మెచ్చి, వర మొసంగ నిటకు వచ్చి
నాఁడఁ, గోరుకొమ్ము వలయుకోరికలెల్ల నే, నిచ్చునప్డు కొదవ యొకింత
కలదె. గి౨౩

వ॥ అంతఁ గృష్ణుండు భక్తినమ్రుండై యద్దేవుపాదమ్ములకెఱఁగి
మేఘగంభీరభాషణమ్ముల నిట్లు నుతించె. గి౨౪

గీ॥ దేవదేవ! జగన్నాథ! దివ్యమూర్తి!, సర్వభూతార్తినాశన! సకలలోక
కారక! సురారిహర! నీలకంఠ! శైల, జామనోహర! యజ్ఞఘ్న!
శరణు నీకు. గి౨౫

ఉ॥ ధన్యుఁడ నైతిఁ బావనతఁ దాల్చితి జన్మము గణ్యమయ్యె సౌ
జన్యము గల్గె నీదుపదసారసముల్ గనుఁగొంటఁ జేసి; యే
నన్యము గోర స్త్రీమయము లైనమహత్తరపాశజాలముల్
దైన్యము నొందఁ జేసె నివి దాఁటఁగఁ జేయఁగదే! కృపామతిన్.

క॥ మానవజన్మం బెత్తిన, దానికిఁ గా నాకుఁ గష్టదశ చేకూరెన్
దీనఁ గృశియించునాదగు, దీనతఁ బాపంగఁ దగదె దీనశరణ్యా.

ఆ॥ వె॥ మొదట గర్భదుఃఖమును బొందికంసుభ, యమునఁ బిదప గోకు
లమున కరిగి, గొల్ల నగుచు నడవి గోవులఁ గాచుట, కన్నఁ గష్ట
మొండు గలదె గిరిశ. గి౨౭

గీ॥ గోరజస్సంగతిం జేసి కొమరు దఱిగి, యాలఁ గాచుచు బృందావనాం
తరమున, నుండ భయపెట్టి మ్లేచ్ఛనాథుండు దానఁ, జేసి ద్వారవతీ
పురిఁ జేరినాఁడ. గి౨౮

వ॥ పిత్రార్జితం బగుమధుర విడిచి ద్వారవతి కేతెంచి యయాతి
శాపంబుకతన రాజ్యం బొల్లక యుగ్రసేనునియంద యునిచి యతనికి
దాసుండ నైతి. గి౩౦

క॥ ఎన్నిటఁ జూచిన సంసృతి, కన్నన్ దుఃఖంబు స్త్రీలకన్న నధర్మా, భ్యు
న్నతియుఁ బారతంత్ర్యము, కన్నన్ బంధం బొకండు గలదే గిరిశా.

గీ॥ జాంబవతి రుక్మిణీతనూజాతులఁ దగ, నరసి సంతాన మిమ్మని నంత
నేను, దనయునికిఁ గా నొనర్చితిఁ దపము లజ్జ, వొడముచున్నది దీనిఁ
జెప్పుటకు నాకు. గి౩౨

గీ॥ ముక్తి నిడఁ జాలునినుఁ గాంచి మూఢబుద్ధి, నెవఁడు గోరెడిఁదుచ్ఛమౌ
నిట్టి ఫలము, కామినీప్రేరితుండనై గళితలజ్జుఁ,డ నయి కోరెద సంతాన
మనఘ నిన్ను. గీ౭౩

క॥ సంసార మెంత కేనియు, హింసాకర మంచు నెఱిఁగి యేను విరతి నా
శంసింపఁ జాలఁ గర్మ, ధ్వంసము భోగమునఁ గాని వలయునె యెందుర్.

వ॥ శాపమ్ముకతన మాయానియంత్రితుండనై నారాయణాంశ
మ్మునఁ బుట్టిసనాకుఁ గర్మానుభవం బింతింతో ౘ దీఱునే యని వగచు మాధ
వున కుమాధవుం డిట్లనియె. గీ౭౭

క॥ పదియాఱువేలపై నే, బదిమంది ముదితలు నీకు భార్య లగుదు ర
మ్ముదితల కొక్కొక్క రితకుఁ, బదిమంది కొమరులు గలిగి ప్రబలెదరు హరీ

వ॥ అని నుడివి శంకరుండు విరమించినఁ బార్వతి ప్రణతుండగు
నమ్మధుసూదనున కిట్లను. నీవు లోకమ్మున నున్న గృహస్థులకెల్ల నొజ్జ
వై శతవత్సరమ్ములు సుఖమ్ముల ననుభవించి ద్విజశాపగాంధారీశాప
మ్ములఁ గులక్షయం బగుడు దేహమ్ము పరిత్యజించి బలరామసహితమ్ముగ
దివమ్మునకు రాఁ గలవు. గీ౭౭

క॥ శోకింపఁ దగునె! విధిపరి. పాకాగత మైనపనులపట్ల నవశ్యం
బే కార్యము గానున్నదొ, యాకార్యం బడ్డుపెట్ట నగునే యెందుర్.

వ॥ నీ వవతారమ్ము చాలించి త్రిదివమ్మున కరిగినమీఁద నష్టావక్ర
శాపమ్మునం జేసి నీభార్యలు చోరులచేఁ బీడింపఁ బడుదు రని చెప్పి
యదృశ్యులైరి పిదపఁ గృష్ణుండును నుపమన్యునకు నమస్కరించి ద్వారక
కరిగి సుఖం బుండె. గీ౭౯

క॥ నరవర! బ్రహ్మాదులకును, దగ మని యెంచకుము మాయ దాఁటఁ గఁ
గర్మో, ద్ధురతఁ బురికొల్పుచుందుర్, బరమాపిణిమాయ; పక్షపాతము
కలదే? గీ౮౦

ఉ॥ ఇంతియ కాని యాజగ దధీశ్వరి కొక్కెడఁ బక్షపాత మొ
క్కింతయు లేదు "జీవులకు నేగతిఁ గల్గునొ ముక్తి" యంచుఁ దాఁ
జింతిలుచుండు లోకము సృజించియు మాయకు లోను జేయదే
నంతయునుర్ జడంబగుఁ దదర్థము యిట్లొనరించు భూవరా. గీ౮౧

క॥ మాయాయత్తులు దివిజులు, మాయామయు లసురులెల్ల మాయాధీ
న, ప్రాయులు త్రిమూర్తులును స్వేచ్ఛాయత్తత నొప్ప నొక్క
యంబికయ నృపా. ౫౯౨

ఆ॥ వె॥ దేవికన్నఁ బరము దెలియంగరా దెందు; నామెపూజకతన నఖిల
మొదవుఁ; దత్పదాబ్జభక్తి దవులనికులమునఁ, బొడమరాదు విను
ము పుడమిఱేఁడ. ౫౯౩

శా॥ జ్ఞానాసక్తి గురుఁ భజించి నియతిం గావించి వేదాంతని
ధ్యానం బొప్పఁగ నప్పరాంబిక మనమ్ముందుఁ దగ న్నిల్పి సం
ధానంబుం బచరించి నిశ్చలవిధానజ్ఞానసంసక్తిమై
"నేనే దేవియుఁనేన బ్రహ్మ" మను దా నెవ్వండు వాఁడల్పుఁడే. ౫౯౪

వ॥ దీనికిం దక్షినవాఁ డెన్నికర్మంబు లొనర్చినను ముక్తుండు
గాఁడు శ్వేతాశ్వతరమహర్షు లందఱు నిట్లు భవబంధవిముక్తులైరి బ్రహ్మ
విష్ణుమహేశ్వరులును తత్కళత్రమ్ములును సచ్చిదానందరూపిణి యగున
ద్దేవిన యెల్లప్పు డారాధింతు రని చెప్పి మఱియును. ౫౯౫

క॥ నరవర! ప్రశ్నంబుల కుత్తర మిచ్చితి భవభయమునఁ దగ నెయ్యది నీ
పంసి యదుగం దలంచెదొ, పురాణములు వినుట కన్నఁ బుణ్యము
గలదే. ౫౯౬

ఆ॥ వె॥ సర్వపాపహరము సకలశుభప్రదం; బనఘ ముత్తమం బహర్ని
శంబు, భక్తి వినెడివారిభవబంధములు వాపు; నిది పురాణము
లకు నెల్ల మిన్న. ౫౯౭

వ॥ అని వ్యాసుండు జనమేజయునకుం జెప్పిన ట్లుక్తకథకుండు
శౌనకాదులకుఁ జెప్పుటయు. శ్రీ. శ్రీ. శ్రీ. ౫౯౮

క॥ లోహితసగోత్రభవ! వి, ద్యాహితసుమనోమనోజ్ఞతత్త్వజ్ఞ! మృదు
వ్యాహార! హారహారస, స్నిహారయశోవిహార! నిరుపమసారా. ౫౯౯

ఉ॥ కారుణికాగ్రగణ్య! నృపకాంతశిరోమణికాంతిరంజిత
శ్రీరమణీయపాదయుగసేవనబంభరితాంతరంగవి
స్ఫారయశోనుషంగపరిచారితసర్వదిగంతతుంగవి
ద్యారతశిష్యసంగవితతాదర! దుర్గయశాస్త్రిసోదరా! ౬౦౦

[illegible]వృత్తము॥ మహీయశ్చరితాః, బహుస్తోత్రపాత్రాః
గృహస్థాత్మధన్యా, బృహత్కీర్తిమాన్యా ౬౮౧

## గద్య.

ఇది శ్రీ—తిరుపతి వేంకటేశ్వర ప్రణీతంబయిన
దేవీభాగవతంబను మహాపురాణంబునందుఁ
జతుర్థస్కంధము.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 9 | 9 | బగు | బలు |
| 13 | 2 | వెర | వెఱ |
| 21 | 18 | బలు | పలు |
| 35 | 20 | దెర | దెరు |
| 47 | 3 | శౌర్య | చౌర్య |

సంపూర్ణము.

